# పే ద ప డు చు

(మహోజ్వల సాంఘిక నాటకం)

ర చ న :

సీతంరాజు వెంకటేశ్వరరావు

పబ్లిషర్సు

విజయ పబ్లికేషన్స్

ప్రొ: వట్లూరి సత్యనారాయణరావు

శీతన్నపేట — విజయవాడ-2.



వెల: రు **1-8-0**

# కలం దూకుడు

ఇది నా తృతీయ పుస్తకము. నేను కవినికాదని 'సినిమా జగత్'లోనే మనవి చేశాను. ఆ సంగతి మర్చిపోకండి. నాటకాలు వ్రాయాలనే వుత్సాహం ప్రారంభంలో లేకపోయినా సోదర సోదరీ మణుల ఆశీస్సులు, నాట్యకళంటే నాకు కల ప్రత్యేక ప్రేమాభిమానాలు నన్ను వ్రాయమని పురికొల్పి ప్రోత్సహిస్తున్నాయ్. అందుకే ఆంధ్ర నాటకరంగస్థలం మీద ప్రదర్శించటానికి అనుకూలంగా అలంకరిస్తుందని ఆసిస్తూ యీ నా చిన్న పొత్తాన్ని అందచేస్తున్నా. మొత్తం పదిహేను రోజుల్లోనే పుస్తకాన్ని పూర్తిచేసి పబ్లిషర్‌కి అందచేయాల్సొచ్చింది. ప్రదర్శించటానికి తగినంత అవకాశం చిక్కకపోవుటచేత ఆ పని చేయలేకపోయాను. కనుక అనేక పొరపాట్లుండచ్చు. సహృదయంతో తెలియపరుస్తే ముందు ముద్రణలో తప్పక సరిదిద్దుకుంటాను. కథ, మాటలు, పాటలు, పాత్రలపేర్లు యేవొక్కరినీ వుద్దేశించి వ్రాసినవికావు ముఖ్యంగా యీనాటకం వ్రాయుటలో నాకు ప్రోత్సాహమిచ్చిన మిత్రుల్లో ప్రథముడు శ్రీ వట్లూరి సత్యనారాయణగారు.వారికి.తదితర మిత్రులకు నాహృదయపూర్వక అభివందనాలు అర్పిస్తూ నా యీ చిన్ని సాంఘిక నాటకాన్ని ఆంధ్ర ప్రజానీకం సహృదయంతో స్వీకరించి నన్ను ఆసీర్వదించి ప్రోత్సహిస్తుందని ఆసిస్తాను. యీ నాటకముయొక్క పూర్తి స్టేజీహక్కులు మినహాయించి మిగిలిన కాపీ రైటు హక్కులు విజయ పబ్లికేషన్స్ ప్రొప్రయిటర్ శ్రీ వట్లూరి సత్యనారాయణగార్కి యివ్వటమైంది. స్టేజీహక్కులు నాకు చెందియున్నవి.

సెలవు

మీ సీతంరాజు.

# కవి కలం

సీతంరాజు గన్నవరం తాలూకా మొఖాసా వీరవల్లి గ్రామ స్తులు శ్రీ సీతంరాజు గుర్నాధరావుగారి ప్రధమ పుత్రుడు. పదవ ఏటలోనే నాట్యకళంటే అభిమానం యితనిలో ప్రారంభమైంది. అప్పటినుండి నాటక రంగ స్థలంమీద తగు పాత్రలను ధరిస్తూ, నాటకాల్ని డైరెక్టుచేస్తూ నేటివరకు కళారాధన చేస్తున్నాడు. గుడివాడ బాల నాట్యమండల్లో కొంతకాలం పనిచేసి, విజయ వాడలో జాతీయ నాట్యకళాసమితిని స్థాపించి కార్యదర్శిగాను నటుడుగాను కొంతకాలం పనిచేసి కళాకారుల అమూల్య ఆశీస్సులు అందుకొన్నాడు. అనంతరం స్వయంగా 'సీతంరాజ్ ఆర్టు ప్రొడక్షన్స్'అనే సంస్థను స్థాపించి కార్యభారం అంతా స్వయంగా చూసు కొంటూ ప్రజలకు కావలసిన వుత్తమ సాంఘిక నాటకాలు అందిస్తున్నాడు. తద్వారా అభిలాషకల కొందరు వ్యక్తుల్ని తగు పాత్ర లిచ్చి ఆంధ్ర నాటక రంగస్థలానికి పరిచయంచేశాడు. నిష్కల్మష జీవి. తన జీవితంలో అనేక క్లిష్టపరిస్తితుల్ని యెదుర్కొని తన జీవితరథాన్ని నడుపుకుంటూ నాట్యకళని ఆరాధిస్తున్నాడు. 'కులంలేని పిల్ల'లో పాపన్న పంతులు, మరికొన్ని నాటకాల్లో ధరించే హాస్య వేషాలూ చూసితీరాలి. యీయన వ్రాసిన నాటకాల్లో యింత వరకు అచ్చై ఆంధ్రదేశంలో మారు మ్రోగుతున్నవి 'సినిమాజగత్' 'పల్లెపిల్ల' యివికాక ముద్రణలో మూడు నాటకాలున్నాయి. ఏమైనప్పటికి నటుడుగానే కాక నాటక రచయితగాకూడా నాల్గు దిక్కులా వ్యాపించిన ఆదర్శ హాస్యనటుడైన మిత్రుడు సీతంరాజుకి వుజ్వలమైన భవిష్యత్‌వుందని ఆసిస్తూ, ప్రజలకు కావలసిన సాంఘికనాటకాలు యెన్నోవ్రాసి ప్రజలకు అందిచ్చి అఖండ విజయాన్ని సాధిస్తాడని ఆసిస్తూ హృదయపూర్వకంగా ఆసీర్వది

స్తున్నాను. యీనాటకం చదవక పోయినప్పటికీ తెలియచేసిన కధను బట్టి పటుత్వంకల పసందైన నాటకమై తీరుతుందని ఆసిస్తాను.

బందరు. 15–11–51 } ఇట్లు భవదీయుడు, (Sd.) వి. యస్. ఆచారి.

## నాటకానికి అవసరమైన పరికరాలు.

బియ్యంతోకూడినచాట - నిలువుటద్దం - గోడఘడియారం - దేముళ్ళ ఫుటోలు - దేశనాయకులఫుటోలు - కొన్నిపుస్తకాలు - టేబులు - సోఫా - రెండుపట్టెమంచాలు - అగ్గిపెట్టె - పుగాకు - సూటుకేసు - బెడ్డింగు - కర్పూరం పళ్ళెం - నులకమంచం - గొంగళి - చాప - పుట్టి - నాలుకుండలు (రెండు చిన్నవి) - కర్ర - కిరసనాలుబుడ్డి - లాంతరు - చీపిరి - పూచికలు - బాదమాకులు - ఫుటోస్టాండ్ - కూజ - గ్లాసు : పిస్టలు మొదలగునవి సమయానుకూలంగా కావాలి.

## హెచ్చరిక

నా లిఖిత పూర్వకమైన అనుమతిని పొందనిదే యీ నాటకాన్ని ఏవిధంగానూ ప్రదర్శింపరాదు. వ్యతిరేకించి ప్రవర్తించువారు నాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు. కనుక ముందు జాగ్రత్త మంచిది.

హనుమాన్ వీధి
సత్యనారాయణపురం
విజయవాడ 2 } ఇట్లు సీతంరాజు (రచయిత)



## సమర్పణ

చవిలేని నా జీవితరంగంలో మితిలేని మాధుర్యాన్ని కురిపిస్తూ, జీవితరథసారథై అంతులేని ఆనందాన్నిచ్చి నన్ని విశాలవిశ్వంలో విడిచి శాశ్వతంగా కళ్లుమూసిన నా అర్ధాంగి

**శ్రీ|| శ్రీ|| సీతంరాజు వరలక్ష్మికి**

హృదయ పూర్వకంగా సమర్పిస్తున్నాను.

ఇట్లు,

శీతంరాజు

# పాత్ర పరిచయం

## చంద్రం

అస్థిపరుడు. వుదార స్వభావంకలవ్యక్తి. కథానాయకుడు.వయస్సు20సం॥లు

## సూర్యం

చంద్రం ప్రాణమిత్రుడు అమాయకుడు తనమాట నెగ్గలేదని అధోగతి పాలైన అవివేకి. 25 సం॥లు

## మూర్తి

దేశద్రోహి కరుణలేని కఠినుడు గౌరిని ప్రేమించి ఫలితం పొందక నిరాశ చెందిన దుష్టబుద్ధి. వయస్సు 30 సం॥లు

## తాత

ఇరుగు పొరుగున నివసించేవృద్ధుడు డబ్బుకోసం ఏంచేయటానికైనా వెర వని నీచుడు. వయస్సు 50 సం॥లు

## బసవయ్య

నిరుపేద జీవి గౌరితండ్రి చల్లని మనస్సుకలవాడు. వయస్సు 40 సం॥లు

## నాగన్న

మూర్తి కుడిభుజం పేదవాళ్ళ సుఖాన్నిచూసి వోర్వలేని వక్రబుద్ధి వయస్సు 30 సం॥లు కొద్దిగా కుంటుతాడు

## గౌరి

పేదరాలు దాసీగా జీవిస్తు దారితప్పి. దగాపడి, నిరపరాధైతన నిర్దోషి త్వాన్ని నిరూపించి ఫలితం పొందిన ప్రణయ జీవి వయస్సు 15 సం॥లు

## సుగుణమ్మ

చంద్రంతల్లి పేదవాళ్ళంటేదయ వయస్సు 50 సం॥లు జుట్టుతీయనివిధవ ఇంకా సబ్‌ఇనస్పెక్టర్. ముగ్గురు పోలీసులు. ముష్టివాడు సమ యానుకూలంగావస్తారు.

# పేద పడుచు

## 1వ రంగం

[స్థలం: చంద్రభవనంలో కచేరుసావిడి. సమయం: ఉదయం 8 గం॥ల ప్రాంతము. వొకప్రక్క టేబులు. దానిమీద కొన్నిపుస్తకాలు వుంటాయి. దానికొంచెంతదూరంలో వొక సోఫా. దానికి ఎదురుగుండా నిలువుటద్దం అమర్చబడివుంటుంది. గోడకు వొకప్రక్క దేశనాయకులు. మరోప్రక్క దేవుళ్లఫొటోలు అమర్చబడివుంటాయ్. సుగుణమ్మ బియ్యం చెరుగుతూ వుంటుంది. తెర నెమ్మదిగా ఎత్తబడుతుంది. గోడఘడియారం ఎనిమిది గెంటలు కొడుతుంది]

తాత : (ప్రవేశించి) సుగుణమ్మా, సుగుణమ్మా!

సుగు : రా బాబాయ్!

తాత : (అక్కడున్న సోఫాలో కూర్చుంటాడు)

సుగు : తెల్లవారేసరికల్లా వచ్చావేమిటి బాబాయ్?

తాత : ఏముంది? నీవల్ల వొక సహాయంకావాల్సి వచ్చాను.

సుగు : ఏమిటా సహాయం?

తాత : మీ పిన్ని చావుబ్రతుకులమీదుంది. పదిరూపాయలుంటే చేబదు లిప్పిస్తావేమోనని....

సుగు : అలాగే బాబాయ్. చిల్లరకాగితా ల్లేవు. పెద్దకాగితం యిస్తాను. మార్చి నీకుకావలసింది తీసుకొని మిగిలింది పంపు.

తాత : అలాగే నమ్మాయ్. (పుగాకుతీసి చుట్ట చుడ్తూవుంటాడు) .... [సుగుణమ్మ లోపలకు వెళ్తుంది. అదార్నే గౌరి ప్రవేశించి టేబుల్‌మీద కాగితాలు మొ॥నవి సర్దుతూవుం

టుంది. తాత చుట్ట నోట్లోపెట్టుకొని] గౌరీ! మీ అమ్మగార్ని అడిగి అగ్గిపెట్టె అందుకో. (గౌరి నిష్క్రమిస్తుంది. ఆ దార్నే సుగుణమ్మ ప్రవేశిస్తుంది)

సుగు : ఇదిగో బాబాయ్. (వంటరూపాయలకాగితం అందిస్తుంది)

తాత : (అందుకొంటూ) చిల్లరకాగితాలు వెంటనే పంపుతానూ—

గౌరి : (అగ్గిపెట్టె తెచ్చి తాతకి అందిస్తుంది)

తాత : (చుట్ట ముట్టిస్తూవుంటాడు)

సుగు : ఆనక పిన్నిని చూట్టానికి రావాలనుకుంటున్నాను.... అప్పుడివ్వచ్చును గాని, యింటలో తొందరేల్లేదు నీదగ్గరే వుంచు.

తాత : (అగ్గిపెట్టె గౌరికి అందిస్తూ) అలాగేలేమ్మా (వెళ్లబోయి) పోనీ యిప్పుడు నాతో రారాదూ వెంటనే వచ్చేద్దువుగాని.

సుగు : రావటానికి వేరేకారణం ఏంలేదు కాని మా చెంద్రం వస్తున్నాడు.

తాత : చంద్రమా ?

సుగు : అవును.

తాత : ఎప్పుడు ?

సుగు : ఈబండీకే వస్తాట్ట. తీరా వాడు వచ్చేసరికి యింటిదగ్గర లేకుండా ఎందుకాని.

తాత : అవునవును .... లేకుండావుంటే ఏలాగు? .... సరెలే అమ్మాయ్....వస్తానూ. (నిష్క్రమిస్తాడు)

సుగు : మంచిది బాబాయి. (గౌరితో) గౌరీ, యీబియ్యంకాస్త చెరిగి బాగుచెయ్. (లోపలకు వెళ్తూవుంటుంది)

గౌరి : ఎవరండి అమ్మగారూ, మనింటికొచ్చే చుట్టాలు ?

సుగు . ఎవరేమిటి పిచ్చిదొంద ? మా చెంద్రం....

గౌరి : అంటే!

సుగు : మా అబ్బాయి .... చూడు. ఆ బియ్యం చెరిగి గదంతా శుభ్రంగా సర్దమ్మా (లోపలికి వెళ్తుంది)

గౌరి : (ఉత్సాహంగా పనులుచేస్తూ పాడుతూవుంటుంది)

వస్తారూ, వస్తారూ
  నేడే యజమానొస్తారు ||వస్తా||
టిక్ టిక్ టిక్మని గోంఱ్రు
  పెట్టుచూవచ్చే బండిలో వస్తారు
వింతవింతలూ చెప్తారు
  చెప్పిన వన్నీ వింటాము ||వస్తా||
రకరకాల వస్తువులెన్నో
  అమ్మకి ముందుగ యిస్తారు
తెచ్చినవన్నీ నా కిస్తారు
  యిచ్చినవన్నీ సర్దాలి
వెంటవెంటనే సర్దాలి
  ఎక్కడిది వక్కడ సర్దాలి ||వస్తా|

[కూలీ పెట్టె, బెడ్డింగులు తెచ్చి లోపలపెడ్తాడు. గౌరి అదిచూసి పాట ఆపి పరుగున లోపలకుపోతుంది. వెంటనే ఆ దార్నే సుగుణమ్మ, వెనక గౌరి ప్రవేశిస్తారు. బయటనుంచి చంద్రం ప్రవేశించి సుగుణమ్మకాళ్ళకి నమస్కరిస్తాడు]

సుగు : (చంద్రాన్ని లేవనెత్తుతో)హారతి తీసుకురా.(చంద్రంతో) కులాసాగావున్నావా బాబూ?

గౌరి : (లోపలకు వెళ్తుంది)

కూలి : డబ్బులు బాబయ్యా!

చం : (పర్సులోనుంచి డబ్బులుతీసి కూలికి అందిస్తూవుంటాడు.)
(గౌరి హారతిపళ్లెంతో ప్రవేశిస్తుంది.గౌరీ చెంద్రాలు వొకరినొకరు రెప్పవాల్చకుండా చూస్తూవుంటారు.హారతి పళ్లెం సుగుణమ్మకి అందివ్వబోయి పరధ్యాన్నంగా అది క్రింద పడేస్తుంది.గౌరి అపశకునానికి తలవంచుకొని విచారిస్తుంది)

సుగు : పోనీలేవే విచారించకు. అలా జరగవలసివుంది. అంతమాత్రానికే మనం విచారించకూడదు.

చంద్రం . (నవ్వి) పూర్వాచారాలు మనింట్లో యింకా మానలేదే! చాలుగాని,తొందరగా స్నానంచేయాలి.ఆ పనేదోచూడండి.

సుగు : నీళ్లక్రింద నిప్పేశావా గౌరి.

గౌరి : వేశానండి.

సుగు : ఫరవాలేదులే విచారించకు. నీళ్లు తొందరగా కాయి, పో.
(చంద్రం లోపలకు వెళ్తున్న గౌరిని చూస్తూవుంటాడు)

సుగు : చంద్రం!

చం : (ఉలిక్కిపడి) అఅఅ.. ఏమిటే! (సమీపానున్న పత్రిక చూస్తూవుంటాడు)

సుగు : మామయ్యా, పిల్లలూ కులాసాగా వున్నార్రా.

చం : ఉన్నారమ్మా.

సుగు : లీలేమంటోంది?

చం : అత్తయ్యని రమ్మంటోంది. (నవ్వుతాడు)

సుగు : లీలని నీకిచ్చి పెండ్లి చేయాలని మా తమ్ముడుకి ఎంతో సరదాగావుంది. ప్రతి వుత్తరంలోనూ, లీలా చంద్రంలు కులాసాగానే చదువుకుంటున్నారని ఏవేవో వ్రాసేవాడు.

చం : (అమాయకంగా) అలాగా !

సుగు : అవున్నాయినా. మేనరికం కావాలంటే కుదురుతుందా? అది కూడా నువ్వంటే పంచప్రాణాలూ విడుస్తుంది.

చం : (ఆక్షేపణగా) అవునవును. అందుకే అదంటె నాకు భలే ప్రేమ.

సుగు : (నవ్వేకుంటూ) ఉండదూ నాయనా, వుంటుంది. మేనత్త మేనమామ బిడ్డలైనందుకు ఆపాటి వుండదూ.

గౌరి : (ప్రవేశించి) నీళ్ళు కాగిపోతున్నాయండీ అమ్మగారు.

సుగు : నీళ్లు తోడు. వస్తున్నాడు.

చం : (నిష్క్రమిస్తున్న గౌరినిచూస్తూ) ఎవరే యీ అమ్మాయ్?

సుగు : పనిమనిషి. యింట్లో పిల్లకంటే ఎక్కువగా తిర్గుతోంది. చాలా మంచిపిల్ల.

చం : అలాగే కనుపిస్తోంది.

(బసవయ్య ప్రవేశిస్తాడు)

బస : (మొహాన చేయి అడ్డుపెట్టుకు చూస్తూ) సుగుణమ్మతల్లీ!

సుగు : ఆ! రా బసవయ్యా....కూర్చో.

చం : యెవరే యీ బసవయ్య ?

సుగు : ఆ పిల్ల తండ్రి.

చం : అలాగా !

బస : (కూర్చొని) ఎవరమ్మా మాట్లాడేది ?

చం : అదేమిటే అలా అడుగుతాడు ?

బస : చూపు సరిగా ఆనదు బాబూ - అందుకడిగాను.

సుగు : తప్పులేదులే బసవయ్యా. మా అబ్బాయి చెంద్రం.

బస : కలకత్తాలో చదువుతున్నారని చెప్పారూ, ఆయనా ?

చం : (నవ్వి) అవును. ఆయనే యీయన.

బస : కులాసాగా వుంటున్నారా అయ్యగారూ ?

చం : ఆ !

సుగు : పనిమీదొచ్చావేం బసవయ్యా—గౌరి కావాలా ?

బస : వద్దు తల్లీ వద్దు. దాన్ని పని చేసుకోనీయండి....యీదార్ని పోతూ పోతూ, చూసిపోదామని వచ్చాను.

గౌరి : నీళ్లు తోడానండి (అంటూ ప్రవేశిస్తుంది)
(చంద్రం గౌరిని చూస్తూనే నిష్క్రమిస్తాడు)

గౌరి : (బసవయ్యని సమీపించి) ఏం నాన్నా యిలావచ్చావు?

బస : ఏమీలేదు తల్లీ. యింటికిపోతూ అమ్మని చూచిపోదామని వచ్చా. యీ వూరొచ్చి పదినెల్లయింది. అప్పటినుంచి యిప్పటివరకూ భగవంతుని దయాంటూ అమ్మనీడనే బ్రతుకుతున్నాం....ఆ తల్లికూడా అమ్మకంటె ఎక్కువగా అభిమానం చూపి ఆదరిస్తోంది. ఆతల్లిని చూడకుండా వుండటానికి మనస్సొండపట్టక వచ్చాను.

సుగు : వస్తే వచ్చావులే బసవయ్యా—పరాయివాళ్లయినా యింట్లో వాళ్ళకంటే ఎక్కువ తిరుగుతున్నారు. అంతే చాలు. గౌరి కూడా దాని ప నదిి లక్షణంగా చేసుకుంటోంది.

బస : అదే ఆనందం తల్లీ. వాళ్లమ్మ పోతూపోతూ యీ పసి కూనని నా చేతుల్లో పెట్టిపోయింది. యేదో యింతవరకు పెంచి పెద్దదాన్ని చేశాను....అదికూడా వాళ్ళమ్మ గౌరవానికి భంగంరాకుండా కాపాడుకుంటోంది. (కన్నీరు తుడ్చుకుంటూ) నా బొందిలో వూపిరుండగానే దానికి నాల్గు అక్షింతలు గింజలూ వేయించానాంటే నా కదే చాలు.

సుగు : కాదూ మరి. ఆడపిల్లల్నికన్న తండ్రికుండే కోర్కె ఆదొక్కటేగా. అయితే మేనరికం....

బస : ఉండటానికి వుంది. వుంది ప్రయోజనం? వాడంత దుష్టుడు ప్రపంచంలో ఎక్కడా కనుపించడు. ఖూనీకోరు, జూదరి, త్రాగుబోతు, వ్యభిచారి- వొక్కటా వుండవలసిన అవలక్షణాలన్నీ వాడిలో వున్నాయి.

గౌరి : (కంటతడిపెట్టి) మా స్తితి యీరోజున యిలావుండటానికి కారణం వాడేకదూ.

సుగు : (ఆశ్చర్యంగా) ఏం ?

గౌరి : అదంతా వొక పెద్ద కథ.

సుగు : ఫరవాలేదులే చెప్పు.

బస : వాడు చేసిన తుంటరిపన్లు చెప్పినా తరగవు.... గౌరిని తను పెండ్లిచేసుకోవాలని చాలాకాలంనుంచి పట్టుపట్టాడు. ఆ పట్టుదల నాకు పరమనీచంగా కనుపించింది.

సుగు : మేనమామేగా పెళ్లిచేయక పోయావు ?

బస : అంతమాత్రాన తడిగుడ్డతో గొంతుకోయమంటావా తల్లీ. వాడు రెండుమూడు ఖూనీలు చేయించాడు. .... తన అఖర్లకి డబ్బు అవసరమని అందుమూలకంగా ఎన్నో దారుణమైన పన్లు చేశాడు.

గౌరి : నన్నిచ్చి పెండ్లిచేయటం మా తాతకి యిష్టంలేకపోతే హటాత్తుగా ఆయన్ని హత్యచేయించాడు.

సుగు : (ఆశ్చర్యంగా) తండ్రినే !

బస : వాడి తండ్రి కాదమ్మా నా తండ్రిని .... అంతటితో

వాడి ఆవేదన చల్లారక మా ఆస్తి అంతనీ అన్యాయంగా అపహరించాడు.

సుగు : యిలాంటివాణ్ణి చూస్తూ గవర్నమెం టెలా సహించి వూరుకుంది ?

గౌరి : లేదు. ఊరుకోలేదు....వాణ్ణి పట్టుకోటానికి ప్రయత్నాలు చేస్తూనేవున్నారు.

బస : కాని లాభం - వాడు దొరకడు. కొంపతీసి దొరికితే వాళ్లకో పాతికో ముప్పయ్యో చదివించి వాళ్ళబారినుండి తప్పించుకుంటాడు.

సుగు : పోనీ నీవెందుకు పట్టించలేదు?

బస : నేనే కాదు. ప్రాణాలమీద ఆశంటూ వున్నవాళ్ళెవరు పట్టించలేరు. వాడంటే వూరు వూరంతా హడలెత్తిపోతుంది.

సుగు : ఏవూళ్ళో వున్నాడు?

గౌరి : ప్రస్తుతం యిక్కడే.

సుగు : (తెల్లబోయి చూస్తూ) ఈవూళ్ళోనా?....అంతటి మొనగాడెవరు నాయనా!

గౌరి : మూర్తి అని మీరు వినేవుంటారు.

సుగు : మూర్తి నీ మేనమామా!....చాలు. యింక వినక్కర్లేదు.

గౌరి : (విచారిస్తూ) మా ప్రాణాలకి పెనుభూతంలా సంచరిస్తున్నాడు.

సుగు : విచారించకే పిచ్చిపిల్లా - నీకు వచ్చిన భయమేమీలేదు. మిమ్మల్ని కాపాడే బాధ్యత మాది.

బస : చల్లని తల్లి. వెయ్యేళ్లు వర్ధిల్లమ్మా.

సుగు : వచ్చే శ్రావణమాసంలో చెంద్రం పెండ్లి చేస్తాం.

బస: ఎలా కుదురుతుందమ్మా ? కానీకి కొరగాని కాకికూడా కట్నం లేందే యిష్టపడని యీ రోజుల్లో ఎలా సాధ్య పడటం ?

సుగు : ఇదంతా మన ఆలోచనేకాని నాలోసినవాడు నీరోయడా ? వాడే తెస్తాడు.

బస : అంతేలేమ్మా. ఆఖరి కా వేదాంతమే గుర్తుకొస్తుంది .... అయినా అన్నిటికీ మీరేవున్నారు. దానికి తల్లీమీరే, తండ్రీ మీరే.

సుగు : అలాగేలే!

బస : వెళ్లొస్తానమ్మా- అబ్బాయిగారితో చెప్పండి. గౌరీ! యిలా రామ్మా-(దగ్గరకు తీసుకొని బుజ్జగిస్తూ) అమ్మ చెప్పిన పనులన్నీ ఆలశ్యం చేయకుండా చేస్తూవుండు తల్లీ! .... వస్తా....(బయటకు వెళ్తాడు)

సుగు : గౌరీ యీ కాగితాలవీ సరీగా సర్దమ్మా- (లోపలకు వెళ్తుంది) (గౌరి కాగితాలూ మొదలగునవి సర్దుతూ వుంటుంది.... చెంద్రం ప్రవేశించి గౌరిని సమీపిస్తాడు)

చం : (అటూ యిటూ చూస్తూ) హారతిపళ్ళెం పడిపోయిందని....

గౌరి : (సిగ్గుతో ప్రక్కకు తప్పుకొని) ఎబ్బే! లేదండి.

చం : ఆ! అయితే నీ పేరు?

గౌరి : (తలవంచుకొని) గౌరి!

చం : చాలా బాగుంది. అరె, సిగ్గుపడ్డావేం? ఎవర్నిచూసి?

గౌరి : (మాట్లాడదు)

చం : ఏదీ - ఒకసారి తలెత్తు.

గౌరి : (మాట్లాడదు)

చం : ఇదేనా యజమాని మాటవినటం?
గౌరి : (నెమ్మదిగా తలెత్తుతుంది)
చం : ఆ! అది. ఇటుచూడు.
గౌరి : (చంద్రాన్ని చూస్తుంది)
చం : చూడు, కలకత్తానుంచి తెచ్చిన వింతవస్తువులన్నీ చూశావా?
గౌరి : చూపించారండి.
చం : ఎవరు?
గౌరి : అమ్మగారు.
చం : ఎలాగున్నాయి?
గౌరి : బాగున్నాయండి.
చం : వాటిల్లో ఏదన్నా కావాలా?
గౌరి : నా కొద్దండి. (సిగ్గుపడుతుంది)
చం : అదిగో మళ్లీ సిగ్గుపడుతున్నావు.
(బయటనుంచి సూర్యం 'చంద్ర చంద్రం' అంటూ పిలుస్తాడు
చం : ఆ! రారా సూర్యం. (గౌరి నిష్క్రమిస్తుంది.)
సూర్యం:(తొందరగా ప్రవేశిస్తూ) అరెరెరెరె అదేమిత్రా అంత చిక్కిపోయావ్?
చం : అంతే!
సూర్యం: పూర్తిగా చిక్కిపోయావేమిటాని.
చం : అనుమానంగా వుందా!
సూర్యం:అవమానంగాకూడా వుంది....ఎందుకనంటావు ?
చం : తిండీ తిప్పలూ సరిగాలేకపోతే....
సూర్యం : అదేమిత్రా-మీమామయ్యున్నాడుగా.
చం : వుండటానికి వున్నాడు. మనం ఉండటంగూడా అక్కడే

సూ : మరింకేం?

చం : మీల్స్ మాత్రం హోటల్లో

సూ : (ఆశ్చర్యంగా) ఆరిపూలా! మన వాళ్ళ దగ్గరున్న జబ్బే యిది. మెతుకుపోతే బ్రతుకు పోతుందని చస్తారు. వెధవ మొహాలూ వీళ్లూను (విసుగ్గా) ఛా ఛా ఛా.

సుగు : ఏమిటి నాయనా అంత విసుగ్గా వున్నావు?

సూ : (మాట తడపడుతూ) అహహ. కాదు పిన్నీ! మా యింటి ప్రక్క యిందుమతమ్మ లేదూ!

సుగు : ఆ! వుంది.

సూ : వట్టి రాలుగాయి ముండలే! మాటల సందర్భంలో దాని మాటొస్తేను ఏదో చెప్పుకుంటున్నాం....సరేకాని పిన్నీ! యీ వేళ మీ యింటిదగ్గరే మన భోజనంకూడా.

సుగు : అలాగేలే నాయనా.

సూ : ఎందు కంటున్నానంటే మనవాడిసరసన తిని చాలా రోజు లైంది కాదూ....(నవ్వి) అందుకని.

సుగు : దానికేంలే రా నాయనా.

సూ : సరెలే పిన్నీ! యిన్నిసార్లు చెప్పాలా, అలాగే వస్తాను. హిహిహిహి, అరేయ్ చంద్రం! నిన్ను చూసేసరికి వెధవ ప్రేమ పొంగిపోయింది. (అందరూ నవ్వుతారు. సుగు ణమ్మ లోపలకెడుతుంది. గౌరి ప్రవేశించి ఒకమూల ఏవో సర్దుతూ వుంటుంది. చంద్రం ఆమెను చూస్తూనే సూర్యంతో మాట్లాడతాడు)యింకా నయం. వాళ్ల తమ్ముణ్ణి తిడ్తున్నట్లు మీ అమ్మ విన్లేదు.

చం: విన్నా యిబ్బంది లేదులే!

సూ: ఏమో ఏంపాడో-నాగుండెలు మాత్రం రైలింజను క్రింద చెక్రాల్లాగా కొట్టుకుంటున్నాయి. (చంద్రాన్ని అమాయకంగా పరిసీలుస్తూ) ఈ జబ్బు కలకత్తాలోనే అంటిందా?

చం: (ఆశ్చర్యంగా) ఏమి టా జబ్బు!

సూ: అదే యీచూపుడు కళ్ళవాపి.

(యిద్దరూ నవుతారు)

సూ: వీపు సదును కాకుండా కాలంగడుపు.

చం: వొరేయ్ సూర్యం! హద్దు మీరుతున్నావురా.

సూ: అనేగా చెప్తున్నాను. (గౌరి నిష్క్రమిస్తుంది)

చం: ఏడ్చావులే నోరుముయ్యి.

సూ: పైగా నేను నోరుముయ్యాలీ? బాగుంది.

చం: సంతోషించాను కాని, మిత్రులంతా కులాసాగావున్నారా?

సూ: ఓ, దిగ్విజయంగా వున్నారు. సరేగాని మిస్టర్, మాట మార్చటంలో నీ అంత మొనగాడులేడు. (అటూయిటూ చూసి) ఆ పిల్లెవరని?

చం: పనిమనిషి—

సూ: ఎక్కడ?

చం: మనింట్లోనే.

సూ: అవునుకదా. నువ్వేమో లక్షాధికారి బిడ్డవి. ఆఫ్టార్ల్ అది పనిమనిషి. మీ యిద్దరికీ నక్కకీ నాగలోకానికీ వున్న దీఫరెన్సుంది. అవునా?

చం: ఊఁ, చెప్పు.

సూ : ఇంకేం చెప్పను వుద్ధరి నీ వాలకం, నీ చూపు అలాంటి పేదపడుచులమీద ప్రయోగిస్తే ఫలితాన్ని పొందటం చాలా కష్టమని చెప్తున్నాను. కాబట్టి....

చం : ఊ–చెప్పు. ఆపావేం ?

సూ : ముందుచూపు లేకుండా, మందమతిగా మంచీ చెడ్డా తెల్సుకోకుండా, పరువుతక్కువ పేదపడుచుమీద ప్రయోగించే నీ దృష్టిని, దయతో మార్చుకోమంటాను.

చం ! (నవ్వి) ఇంతేనా!

సూ : అంతకంటే ఏమీలేదు

చం : విన్నాను.వింటున్నాను.దయవుంచి యింకెప్పుడూ ఇలాంటి మాటల్తో నా మనస్సుని మలినంచేయబోకు.

సూ : ఏం ?

చం : కాకపోతే నే నేమిటి? ఆ అమ్మాయిని....

సూ : అహహహహ. చెప్పకుండానే తెల్సిపోయిందిలే - అలా జరిగితే సంతోషమే !

చం : మరి

సూ : యింక మాట్లాడను.

చం : ఇంకేం! అలా బజార్లోకి పోయొద్దాంరా.

సూ : ఎందుకురాను.తప్పకుండా వస్తాను పద. (లేచి ఆలోచించి) మరి భోజనానికి ఆలశ్యం అవుతుందేమో?

చం : తూర్పు తెల్లారలేదు. అప్పుడే భోజనానికి అంత హడావిడా ? ఫరవాలేదులే. అంతగా ఆకలైతే కడుపునిండా కాఫీ పోయిస్తాను.

సూ : O. K. (యిద్దరూ సిగరెట్లు ముట్టిస్తూ వుంటారు) (తెర)

# పేదపడుచు

## రెండవ రంగం

[స్థలం : బసవయ్య పూరిపాక. సమయం: పుదయం ఆరుగంటలు. పాకలో ఒకవైపు వడ్లెం, దానిమీద కొన్నిగుడ్డలు, మరోవైపు పుట్టి అందులో రెండు కుండలూ, వేలాడుతూవుంటాయి. క్రింద కొన్ని కుండలు దొర్లించి వుంటాయి వాటికి సమీపాన బసవయ్య నులకమంచంమీద గొంగళీ ముసుగుపెట్టుకుని నిద్రపోతూ వుంటాడు. బసవయ్యకి కొంత దూరంలో గౌరి యీతాకు చాపమీద నిద్రపోతూవుంటుంది. మూలగా కిరసనాలు బుడ్డి వెలుగుతూ వుంటుంది. తెర నెమ్మదిగా లేస్తుంది. తెరలో జనం మాట్లాడుకుంటున్నట్లు వినపడుతుంది] [నిద్రలేచి అటూయిటూ చూసి, వెంట వెంటనే తనింటిపన్లు చేసుకుంటూ పాటపాడుతుంది]

తెల్లవారె తెల్లగాను
మేలుకోండమ్మా
యింటిపన్లు ముగించుకూ
కూలికెళ్లండి.
కష్టపడి కూలి తెచ్చి
పొదుపు నింపండి. ॥తెల్ల॥

పేదపడుచులార మీరు
పసందుగ పనులకెళ్లి
పన్లుచేసి హాయిగాను
యిల్లుచేరండి
వున్నదాన్ని ఆరగించి
తృప్తిపడండి ॥తెల్ల॥

బస : (బద్ధకంగాలేచి ఆవలిస్తూ) గౌరీ!తూర్పు తెల్లార్లేదు.అప్పుడే మొదలుపెట్టావేం తల్లీ. నిద్దరపట్టటల్లేదా?

గౌరి : (నవ్వి) అదేమిటి నాన్నా! తెల్లారి చాలా సేపయింది

బస : (అటూయిటూ చూసి) ఆ! యింకా నేను తెల్లార్లేదను కుంటున్నాను.

గౌరి : రాత్రి భాగవతంనాటకం చూశాంకాదూ....

బస : భాగవతం బలేపని చేసిందే!యింకా తెల్లార్లేదని బద్ధకంగా పడుకుంటున్నాను.. యింకా నయం..సరేగాని,తొందరగా పుగాకుపెట్టి అందుకో.

గౌరి : (పుగాకుపెట్టి అందిస్తుంది)

బస : (చుట చుట్టుకుంటూ)యింకా పనికి పోలేదేం తల్లీ!

గౌరి : పోతున్నాను నాన్నా !

(బసవయ్య చుట్ట ముట్టిస్తూవుండగా మూర్తి నెమ్మదిగా బయటనుంచి ప్రవేశిస్తాడు)

గౌరి : (మూర్తిని చూసి నొసళ్లు చిట్లిస్తుంది)

మూర్తి: బావా!యీ బావమర్ది సంగ తేమాలోచించావు ?

బస : ఏమిటి ఆలోచించేది?(పీలుస్తాడు.చుట్ట ఆరిపోతుంది)

మూర్తి:అదే!

గౌరి : ఏది?

బస : (తిర్గి అగ్గిపుల్లగీస్తాడు)

మూర్తి:మన పెండ్లివిషయం.

బస : నీవు చేసినద్రోహం నాహృదయంలో యిలా మండి పోతోంది(మండుతున్న అగ్గిపుల్ల చూపిస్తాడు)మానమర్యా

దలు కలవాడికి మరోమాటతో పనిలేదు-ఎప్పుడూ వాకే మాటమీద నిలబడతాడు.

మూర్తి:ఏమిటామాట ?

బస : ఇదివరకే చెప్పాను (లేస్తాడు)

మూర్తి:అదే ఖాయమా!

బస : అవును.ముమ్మాటికీ ఖాయం (నిష్క్రమిస్తాడు)

మూర్తి:(గౌరిని చూస్తూ సిగరెట్టు ముట్టించి)నువ్వేమంటావే పిల్లా?

గౌరి : (విసుగ్గా)పనికి పోవాలి. దయచేయమంటున్నా(దారిచూపిస్తుంది)

మూర్తి:(నవ్వి)గౌరీ!తల్చుకున్నపని నెరవేరేదాకా మూర్తిపట్టుదల ఎలాంటిదో ఎరుగుదువుగా!

గౌరి . ఆపట్టుదలే మాకూ పట్టిందని నువ్వూ తెల్సుకున్నావుగా!

మూర్తి:(ఈర్ష్యగా) తె.లు.సు.ను, సాగదని. వృధాప్రయాసపడి చేతకాని మాటలతో కాలయాపనచేయక కార్యక్రమానికి పూనుకోండి.కాదంటే కష్టంకల్గుతుంది.కష్టానికి నష్టంగా అష్టకష్టాలూపడి అల్లరిపాలవుతావు. దూరమాలోచించుకో.

గౌరి : అయినా సంతోషమే. తల్లిపోగానే నిల్చోటానికి నీడ లేకుండా ఆ యింటినికూస్తా అపహరించావు.

మూర్తి : అదీ నీకోసమే !

గౌరి : నానా అగచాట్లూ పెట్టి మానాన్న పరువుప్రతిష్టలు పాడుచేసి ఆయన్ని నలుగుర్లోనూ తలెత్తుకోకుండాచేశావు.

మూర్తి : (నవ్వి)అదీ నీకోసమే గౌరీ ! నేనేంచేసినా నీకోసమే !

గౌరి : ఇంతేనా ? యింతకంటె ఏమన్నా చేస్తావా ?

మూ_ర్తి: ఏదన్నా చేస్తాను — ఎందుకు? నీ కోసం, నీ ప్రేమ కోసం. నీ అందాన్ని చూసి ఆనందిస్తూ తీయని మధుర స్వప్నాలతో మ్రగ్గిపోతున్నాను. నిగనిగలాడే నీ సుందర విగ్రహం నా హృదయంలో మిలమిలా మెరిసిపోతోంది. కావాలని కాళ్ల దగ్గరకొచ్చిన ప్రేమమూ_ర్తిని కాదని కాల తన్నకూడదు. అది ఆడదాని అప్రయోజకత్వాన్ని తెల్పుతుంది. యిప్పటికైనా నన్ను అర్ధంచేసుకొని నన్నాదరించి నా ప్రేమను అరగించు. (సమీపిస్తూ) గౌరీ!.... యీ దాసుణ్ణి కనికరించి ప్రేమభిక్ష పెట్టు.

గౌరి: ప్రేమ.వొకనీచునికి పవిత్ర ప్రేమభిక్ష: నువుచేసిన అత్యాచారాలు నీకు ప్రేమభిక్షకుబదులు పటాపంచలుచేస్తాయి. నిన్ను....యిప్పటికైనా పశ్చాత్తాప్పది పరువుగా బ్రతకటానికి ప్రయత్నించు.

మూ_ర్తి:(పెద్దగా)గౌరీ!

గౌరి: ఇంతకంటే నన్నేం చేయలేవు.

మూ_ర్తి:(నవ్వి)యేమిచేయలేను.(వికటంగా నవ్వుతాడు)యేమీ చేయలేను కాదూ?

గౌరి: ఏంచేస్తావు?

మూ_ర్తి:ఏంచేస్తానా? యీ పంచకూడా లేకుండా పాడుచేస్తాను. సంఘంలో సాకులు చెప్పి నిన్నూ, నీతండ్రిని నామరూపాల్లేకుండా నాశనంచేయిస్తాను. దిక్కులేక వీధివీధిని అడుక్కుతినే గతి కల్గచేస్తాను.

గౌరి: నొసటనున్న గీత తప్పించలేవుగా!

మూ_ర్తి: ఈవేదాంతమే మిమ్మల్ని వీధికి లాగుతోంది.నామాట విను

గౌరి : వినను వినవలసినపనిలేదు. (దారి చూపిస్తూ) దయవుంచి దారిపట్టండి (పెద్దగా) ఊఁ! వెళ్ళవేం?

మూర్తి:(నవ్వి) ఆహా! కోపంకుడా నీముఖానికి మరింత అందాన్ని

గౌరి : (పెద్దగా) నోర్ముయ్. నీలాంటి సంఘద్రోహి, నీచుడు, త్రాగుమోతు, జూదరి....

మూర్తి : షటప్. (చెంపపై కొడ్తాడు) ఆలోచించుకో. మనిద్దరికీ పెండ్లి జరిగితీరాలి. జాగుచేస్తే అపజయం ఆదర్శమై ఆహుతౌతారు.జాగ్రత్త (చరచరా వెళ్తాడు)

గౌరి : (చెంప సవిరించుకుంటూ) దుర్వ్యసనాలకి ఆలవాలమైన యిలాంటి ఘట్టాలు వున్నమాటంటే వులిక్కిపడతారు. పేదవాళ్లంటే అంత చులకనగా ఎందుకు చూస్తున్నారో తెల్సుకునేవాళ్లేరి? పేదవాళ్లేనా పరువుతక్కువగా బ్రతికే భ్రష్టులు? వాళ్లు మనుష్యులు కారా? వాళ్లకి రక్తమాంసా ల్లేవా? డబ్బుగలవాళ్లకోర్కెలు కొనసాగించటానికి పేద వాళ్లేనా పరికరాలుగా పనికొచ్చేది? ....అవును ధనికుల దౌర్జన్యాలు పేదవాళ్లమీదికే పరుగెత్తుతాయ్....అన్యా యానికి,అక్రమానికి అర్రులుజాచే అప్రయోజకులు వున్నంతకాలం నాలాంటి అబలలు అంధకారంలో అదృ శ్యం కావలసిందే! అందాకా వాళ్లు నిద్రపోరు.

చం : (కూనిరాగంతీస్తూ ప్రవేశించి) గౌరీ!

గౌరి : (కళ్లనీళ్లు తుడ్చుకుంటూ) రండి—(నులకమంచం చూ పించి) కూర్చోండి.

చం : (గౌరిని చూస్తూ) పిచ్చిపిల్లా,ఎందుకల్లావున్నావు?

గౌరి : (లేని సంతోషంతో) ఏమీ లేదండి. తలనొప్పిగావుంది.

చం : అంతమాత్రానికేనా ? (కూర్చుంటాడు) మం దేవన్నా వాడకపోయావా ?

గౌరి : ఫరవాలేదులెండి... ఆ. క్షమించండి. పేదవాళ్లం, పరువుగా బ్రతికే తమలాంటి ప్రభువుల్ని ఎలా సత్కరించాలో తెలియటల్లేదు.

చం : ఏం? యింతకంటె ఏంకావాలి? రమ్మని స్వాగతమిచ్చావు. కూర్చోటానికి మంచం చూపావు.. చాలు భాగ్యమంతులు యింతకంటే బండారం చూపిస్తారనుకుంటున్నావా ?

గౌరి : మాటపరుస కంటారే కాని....

చం : మనస్సులో మరో మాటుందంటావ్. అవునా?—ఊఁ—అప్పుడే గ్రహించావ్ !

గౌరి : లేదంటారా ?

చం : లేకపోతే యిక్కడ కెందుకొస్తాను? గౌరీ!నువు మంచిదానివి. మంచితనంలో నీకు నువ్వే సాక్షి....ఆ,అన్నట్లు మర్చాను, యీవేళ పనికి రాలేదేం ? తలనొప్పివల్లేనా ?

గౌరి : అవును.యిప్పటికే చాలా ఆలశ్యమైంది అమ్మగారు నా కోసం ఎదురు చూస్తూవుంటారు. మాటలసందర్భంలో ఆమాటే మర్చాను

చం : ఫరవాలేదులే-కూర్చో.

గౌరి : అమ్మగారు ఆగ్రహిస్తారు.

చం : ఆగ్రహాన్ని అనుగ్రహంగా మారుస్తానుగా....గౌరీ! నీతో ఏకాంతంగా మాట్లాడాలని యెంతోకాలంనుంచి యెదురు చూస్తున్నాను.అవకాశం కోసం అహర్నిశలూ ప్రయత్నం చేస్తున్నా.

గౌరి : (ఆశ్చర్యంగా) నాతోనా ? (నెమ్మదిగా) ఏకాంతంగానా ?
చం : అవును....అవకాశాన్ని....
గౌరి : (ఆలోచిస్తుంది)
చం : అనుమానిస్తున్నావా ?
గౌరి : లేదు, చెప్పండి.
చం : అయితే కూర్చో.

(గౌరి క్రింద కూర్చుంటుంది)

చం : ఊహూఁ-యిక్కడ కూర్చోవాలి. (మంచం చూపిస్తాడు)
గౌరి : తప్పు....తారతమ్యాల్లేకుండా ఆపనిచేయటం చాలా తప్పు.
చం : ఎందుకని ?
గౌరి : మీకూ మాకూ చాలా దూరంవుంది.
చం : (నవ్వి) ఏది ?అర్ధగజంకంటె ఎక్కువలేదే! (సమీపించబోతాడు)
గౌరి : (లేచి కొంచెందూరంగా నిల్చుంటుంది)
చం : ఫరవాలేదులే, రా-
గౌరి : వద్దు. క్షమించండి.
చం : గౌరీ! (భుజంమీద చెయివేస్తాడు)
గౌరి : (చంద్రాన్నిచూసి గాబరాపడ్తూ నెమ్మదిగా) నేను మీ యింట్లో దాసిని.
చం : లేదు.నీప్రేమకు నేను దాసుణ్ణి. నిన్నూ, నీ సౌందర్యాన్ని చూస్తూ, అనుక్షణం నాలోనేను ఆనందిస్తూ పొంగిపోతున్నాను. శరీరాలు వేరైనా హృదయాలురెండూ వొకే హృదయంగా వుండాలనే ఆశతో ఎదురుచూస్తున్నాను. నిన్ను ప్రేమించి,పెండ్లిచేసుకొని ఆదర్శంగా బ్రతకాలని

అలమటిస్తున్నాను. అదే నాహృదయంలో ఆశాసౌధంగా నిర్మించబడి,నీ పవిత్రప్రేమను పొందాలని ప్రాకులాడు తోంది.

గౌరి : (గాబరాపడ్తూ)వద్దు.యిది మీకు తగనిపని.తింటానికి తిండి లేక,పడుంటానికి పంచలేక తమర్ని నమ్ముకొని తమ పంచన దాసీదాసిగా చేరాను. దయవుంచి యీ దరిద్రురాల్ని విడ్చి ధనికులపిల్లని పెండ్లాడి సుఖపడండి.

చం : పిచ్చిదానా! ధనానికి ప్రేమకీ సంబంధంలేదు.యీరోజుల్లో ధనికునికంటే పేదవాడే పరువుగా బ్రతుకుతున్నాడు. పేదవాళ్లు వున్నదానితోనే తృప్తిపడి సుఖంగా జీవనం చేస్తారు.ధనికుడు వున్నదానికి పదిరెట్లు కలపాలని వుబలాటపడి,పాపాన్ని ఆరాధించి,పరమనీచులుగా బయట పడతారు కాయకష్టంచేసి జీవించే కన్యకంటే కాలుమీద కాలువేసుకుని కులుకుతూ కూర్చునే కన్యని ప్రేమించి పెండ్లాడితే సుఖంలేదు.నామాట నమ్ము.ఏనాడు నిన్ను చూశానో ఆనాటినుంచే నాహృదయాన్ని నీకు, నీప్రేమకి అంకితంచేశాను.మరువరాని మధురస్వప్నాలతో శరీరాన్నే మైమరచి,నాహృదయకిరీటంగా నిన్ను ఆరాధిస్తూ అవకాశంకోసం ఎదురుచూస్తూ పొంగిపోతున్నాను. నిన్నే ప్రేమించి నీ ప్రేమభిక్షకోసం ప్రాకులాడుతున్నా! గౌరీ.... నువ్వే నాకూ,నా హృదయ సామ్రాజ్యానికీ మహారాణివి.

గౌరి : పేదపడుచుకోసం ప్రయాసపడి ప్రేమించి పెండ్లిచేసుకుంటే మీ పరువు ప్రతిష్టలకే భగంకల్గుతుంది. సంఘంలో విలువతగ్గి సాటివాళ్ళల్లో నవ్వుల పాలవుతారు.

చం : అయినా సంతోషమే! ప్రేమ పేదరికాన్ని చూడదు. నీకోసం నీ ప్రేమకోసం యేంచేయటానికైనా సిద్ధంగా వున్నాను.

గౌరి : నన్ను నిర్బంధించకండి. (చెయి విదల్చుకొని) అందని ఆదర్శంకోసం ఆశపడి, అపజయం పొందటానికి నా మనస్సు అంగీకరించటల్లేదు. నామాట వినండి.

చం : (నిరుత్సాహంగా) నా ఆశ నిరాశ కావలసిందేనా! నిన్ను ప్రేమించి ఫలితం పొందలేని అభాగ్యుణ్ణి కావలసిందేనా;

గౌరి : (పొంగి పొర్లే దుఃఖంతో) చంద్రంగారూ, కుక్కకంటే హీనంగా వుండాల్సిన మమ్మల్ని ఆదరించి అన్నం పెట్టారు. అక్షరాలా మీ మాట ప్రకారం నడుచుకోవలసిన బాధ్యత నామీదుంది. కాని అందుమూలంగా భరించరాని బాధ పడాలని భయపడుతున్నాను. యిప్పటికైనా నామీద కనికరం చూపి నన్ను మరువటానికి ప్రయత్నించండి.

చం : ఎలా సాధ్యపడటం? ఈ విశాలవిశ్వంలో ఏమూలచూసినా నువ్వే కనిపిస్తున్నావు....నీ అందమే నన్ను వెంటాడుతోంది....ఆకర్షించగల పుష్పాన్ని అందుకోని అభాగ్యుడుంటాడా ? గౌరీ! నన్నర్ధంచేసుకో. నాకు నీ పవిత్రప్రేమ భిక్ష ప్రసాదించు. మనం పెండ్లి చేసుకుందాం.

గౌరి : వద్దు. మనం పెండ్లి చేసుకుంటే మాకు యీతిండికూడా లేకుండా పోతుంది. అమ్మకి ఆగ్రహంకల్గి నన్ను నేకతూలనాడుతుంది.

చం : భయంలేదు. నన్ను అపార్ధం చేసుకుంటున్నావ్. సమయం వస్తే నీ కోసం సర్వం త్యజించివేస్తాను .... భగవంతు

డిచ్చిన రెక్కలున్నాయ్. కష్టపడి కూలిపనిచేసి కడుపు నింపుకుందాం.

గౌరి : (వొక్కసారి చంద్రాన్ని చూసి ఆలోచిస్తూ నెమ్మదిగా) నాకోసం సర్వం త్యజించి వేస్తారా ?

చం : అవును. మాటయందు నమ్మకం లేకపోతే ప్రమాణంచేసి చెప్తున్నాను....

గౌరి : (చంద్రాన్ని చూస్తుంది)

చం : నమ్మలేకపోతున్నావా ?

గౌరి : హృదయపూర్వకంగా నమ్ముతున్నాను.

చం : (ప్రేమగా) గౌరీ ! (దగ్గరకి తీసుకుంటాడు)

గౌరి : (ఆనంద బాష్పాలు విడుస్తూ) చంద్రంగారూ!

(చంద్రం గౌరిని ముద్దుపెట్టుకోబోతాడు. గౌరి తప్పించుకొంటుంది- చంద్రం వుత్సాహంగా పాడతాడు)

అహహ- ఆహహ్హాహాహహ - అహహ్హ అహహా
ఆయే నిజమాయే - నాకల నిజమాయే
తీరుగ ఆశలు - నా మదిలోనా
తీర్చిదిద్దగ వచ్చితివో ॥ఆయె॥

గౌరి : అహహా ఆహహహ - అహహహహహ
నేనే భాగ్యరాసినిగా - ధన్యురాలనుగా ॥నేనే॥

చం : తళుకు తళుక్‌మనె - నీ యవ్వనము
చలక్ చలక్‌మనె నా హృదయమున
మెరుపు తీగెగా - మెరియుచుంటివో ॥ఆయే॥

గౌరి : వాకేమాటగ - వాకేపాటగ
ఏకతీగగా - ఎంతో హాయిగనుందాము
ఆడుచుపాడుచు - విహరింతాము ॥నేనే॥

చం : } ఆయెగా నిజమాయెనుగా
గౌరి : } మన కల నిజమాయెనుగా
తీరుగ ఆశలు - మన మదిలోనూ
తీర్చి దిద్దగ - విహరింతామూ
హాయి హాయిగ - ఆడుకుందాము ॥ఆయె॥

చం : (గౌరిని కౌగిట్లోకి తీసుకొని) మనం ఆదర్శ దంపతులుగా జీవించి అఖండ విజయాన్ని సాధిద్దాం. ప్రేమకి పేదరికంతోనూ, సంఘం, సంఘనియమాలతోనూ నిమిత్తంలేదని ప్రపంచం ప్రతిధ్వనించేటట్లు ప్రచారం చేద్దాం. నేటి నుండి నీవు నాభార్యవి. (మూర్తి ప్రవేశించి వీళ్లనిచూసి యీర్ష్యగా సకిలిస్తాడు. గౌరి చంద్రంలు విడిపోతారు)

మూర్తి: (నవ్వి) నమస్తే చంద్రంగారూ!

చం : (నొసళ్లు చిట్లించి) నమస్తే! (విసుగ్గా అంటాడు)

మూర్తి: పాపం. దారితప్పి వచ్చారేం?

చం : వచ్చాను.

మూర్తి: దగా చేయటానికేనా?

చం : కాదు.

మూర్తి: అయితే కారణం తెల్సుకోవచ్చా?

చం : గౌరిని పనికి పిల్చుకు పోవాలని....

మూర్తి: వచ్చె ప్రణయకలాపాలు ప్రారంభించారా!.... నేనూ అదే అనుకున్నానులే!

గౌరి: (కోపంగా) ఇంకేం - యిహ దయచేయండి.

మూర్తి: మరి నువ్వేమంటావు?

గౌరి: యిది నా స్వవిషయం.

మూర్తి: సరైన పంథాలో నడిపే అధికారం నాకుంది. చంద్రం గారి సంగతి నీకు తెలియదు. పట్టి మోసగారి.... తీయని మాటల్తో తేనెలు కురిపించి అమాయకులైన ఆడవాళ్ల నెందర్నో అధోగతిపాలు చేశాడు....

చం: (పెద్దగా) మూర్తీ!

మూర్తి: అనవసరం.... గౌరీ, కన్నుగానక కామం కళ్ళకి పొరలుగా కప్పి, నీ జీవితాన్ని మలినం చేయాలని ముందడుగు వేస్తున్నాడు.... నిన్నూ, నీ గౌరవాన్ని గోడగడ్డలు చేసి గంగపాలు చేయాలని పన్నిన పన్నాగం....

చం: (పెద్దగా) ఆపు. (చెంపమీద కొడ్తాడు)

మూర్తి: (వెనకవున్న కర్రతీసి) నన్నేనురా కొట్టావు .... నువ్వేమవుతావో ఆలోచించుకో. (కొట్టబోతాడు)

గౌరి: (అడ్డువచ్చి) ఆగు.... ఏమి టా దౌర్జన్యం?

మూర్తి: (కర్ర పక్కన పడేసి, గౌరిముఖంచూసి) నిన్ను క్షమించి వదిలిపెడుతున్నాను. లేకపోతే యీపాటికి యమలోకానికి ప్రయాణం కట్టివుండేవాడివి.... గౌరీ! దూరమాలోచించి మరీ మొదలెట్టు నీ ప్రణయ కలాపాలు.

గౌరి: (ఆక్షేపణగా) చిత్తం, అలాగే!

మూర్తి:(యిద్దర్నీ చూస్తూ) నన్ను మర్చిపోకండి. వస్తానూ.
(చరచరా వెళ్తాడు)

చం : గౌరీ ! వీ డిక్కడి కెందు కొచ్చాడు ?

గౌరి : ఎందు కొస్తాడు.నన్ను ప్రేమించాట్ట! పెండ్లి చేసుకుంటాడట
పగపట్టిన పాములాగా వెంటాడుతున్నాడు.

చం : ఇష్టంలేదనీ, యింటికి రావద్దనీ గట్టిగా చెప్పక పోయావా?

గౌరి : చెప్పినా వినుపించుకోందేనా. రావద్దని అస్లేకుండావున్నాను

చం : ఎందుకని ?

గౌరి : వాడు నా మేనమామ.

చం : అంటే ?

గౌరి : మా అమ్మకు సాక్షాత్తు తమ్ముడు.

చం : అయితే మాత్రం,యిలాంటి దుష్టులికి దూరంగానే వుండాలి.

గౌరి : అదంతా వొక పెద్దగాథ. తర్వాత చెప్తాను.

చం : ఈసంగతి మీ నాన్నకి తెల్సునా ?

గౌరి : తెల్సును.

చం : ఆయ నేమంటాడు ?

గౌరి : నిధానంమీద నిర్మూలం చేస్తానంటాడు.

చం : సరె, అర్థమైంది. యిలాంటి నీచులకి తగిన బుద్ధిచెప్పి,వాళ్ల
ప్రవర్తనని సరిదిద్దాలి. దానికి అపాయంలేని వుపాయం
ఆలోచించాలి....వస్తానూ .... తిర్గి సాయంత్రం కల్సు
కుంటాను.

గౌరి : (సరె అన్నట్లు తలూపుతుంది)
(చంద్రం నిష్క్రమిస్తాడు. గౌరి అతను వెళ్ళిన మార్గాన్నే
చూస్తూ వుంటుంది) ( తెర )

# వేదపడుచు

## మూడవ రంగం

[స్థలం : చంద్రంయింట్లో చావిడి. సమయం : మధ్యాన్నం మూడు గంటలప్రాంతం సుగుణమ్మ విస్తళ్లు కుట్టూవుంటుంది. ముందు కొన్ని బాదమాకులు, కొన్ని పూచికలు పడుంటాయి-మిగిలిన రంగాలకరణంతా మొదటిరంగంలోవలెనే వుండాలి కాని, పట్టెమంచంమాత్రం వాల్చబడి వుండాలి. గోడఘడియారం మూడుగంటలు చూపించాలి. తెర నెమ్మదిగా ఎత్తబడుతుంది]

తాత : (దగ్గుతూ ప్రవేశిస్తాడు)

సుగు : రా బాబాయ్....

తాత : వస్తున్నానమ్మాయి, వస్తున్నాను. (ప్రవేశించి మంచంమీద కూర్చుంటాడు)

సుగు : ఏమిటి బాబాయి విశేషాలు ?

తాత : విశేషాలకేం, వింటే చాలావున్నాయి. (అటూ యిటూ చూస్తూ) చంద్రం యింట్లో లేడూ ?

సుగు : లేడు. యిప్పుడే అలా వెళ్లాడు....పనేమన్నావుందా ?

తాత : ఉంది. ఎందుకులేదు....సుగుణమ్మా ! యిదివరకల్లా చెంద్రం చాలా బుద్ధిమంతు డనుకునేవాణ్ణి.

సుగు : (ఆశ్చర్యంగా) ఇప్పుడో ?

తాత : ఏంచెప్పను. ఎలా చెప్పాలో నాకే తెలియటల్లేదు .... చెప్ప టానికి మనస్సంగీకరించటల్లేదు. చెప్పకుండా వుండలేక పోతున్నాను.

సుగు : ఏమిటి బాబాయ్, ఎవర్నన్నా ఏమన్నా అన్నాడా ?
తాత : అందులో యింకా ప్రవేశించలేదులే అమ్మాయ్ !
సుగు : అయితే యిప్పుడొచ్చిన నష్టం ?
తాత : చాలా కష్టమైందే !
సుగు : ఏమిటది ?
తాత : ఏముంది ? మీవా డీ మధ్య పనికిమాలినపనుల్లో దిగాడు.
సుగు : ఏంచేశాడు ?
తాత : ఏంచేశాడా ? మీయింట్లో పనిమనిషి గౌరిని....
సుగు : గౌరిని ఏమన్నా అన్నాడా ?
తాత : ఏమంటాడు ? దాన్ని ప్రేమించాట్ట. పెండ్లి చేసుకుంటాడుట.
సుగు : ఎవరు చెప్పారు ?
తాత : పిచ్చితల్లీ ! వొకరు చెప్పాలా ? గోడకు చెవులుంటాయ్. అందరూ అనుకుంటున్నారు.
సుగు : అందుకే నువ్వూ అంటున్నావా ? చంద్రం అలాంటిపన్లు చేయడు.
తాత : అలా వీధిగుమ్మంలోకి పోయి చూడు. వూరు వూరంతా ప్రతిధ్వనిస్తోంది. అంతేకాకుండా, దాని మేనమామ మూర్తి లేడూ, వాడు ప్రసిద్ధికెక్కిన రౌడీగాడు. వాడు స్వయంగా చూశాట్ట. కంటికి కనబడ్డవాళ్లందరితోనూ చంద్రం అంతు తేల్చుకుంటానని మీసం మెలేస్తున్నాట్ట.
సుగు : ఆఁ! యదార్థమేనా ?
తాత : ఎప్పుడన్నా అబద్ధం చెప్పానా? అయినా ఎలుక పిల్లితో చెలగాటమాడినట్లు ఆ రౌడీగాడితో పీడి కెందుకు చెప్పు.

సుగు : ఇదెక్కడి పాపఖర్మం.అసలే వాడు దుర్మార్గుడు.

తాత : అవునుకదా. 'దుష్టునికి దూరంగా వుండమని'మనవాళ్లు వూరికే అన్నారా?....యితరులు మీ సంసారంలో కల్గ చేసుకోటం నా కంతగా బాగుళ్లేదు. పెద్దముండాకొడుకుని. నాకూ మీపిన్నికీ చిన్నప్పటినుంచి మీరంటే యెంతో అభిమానం.అందుకని విన్నమాటల్ని నీ చెవిని వేయకుండా వుండలేకపోయాను....సుగుణమ్మా! మీక్షేమం కోరి చెప్తున్నాను.'పుండు పుట్టగానే మందువేయాలి'చంద్రాన్ని ఇప్పటికైనా మందలించి మంచిమార్గంలో పెట్టు. లేకపోతే చాలాకష్టం.

సుగు : ఇలా ఎంతకాలంనుంచీ జర్గుతోంది బాబాయ్?

తాత : నే నేం చెప్పను సుగుణమ్మా!....బయటపడి పదిరోజులైంది

సుగు : ఇంతవరకూ ఎందుకు చెప్పలేదు?

తాత : ఇప్పుడుమాత్రం మించిపోయిం దేం లేదు.అసలు దానికీ వాడికి సంబంధ మెక్కడ చెప్పు? లక్షాధికారికి భిక్షాధికారితో బాంధవ్యమా? పాచిపనిచేసి బ్రతికే దాసీపిల్లని స్తితిపరుడైన మన చంద్రం ప్రేమించటమా? నలుగుర్లోనూ ఎంత నామర్దాపనో ఆలోచించు.

సుగు : అవును బాబాయ్.(విచారంగా)అందుకే నాగుండె నీరై పోతోంది. తండ్రిలేని పిల్లాడు, బాగుపడి వృద్ధిలోకొచ్చి తండ్రిపేరు నిల్పుతాడని భ్రమించాను.నీమాటలు విన్నాక ఆనాటి ఆశ యీనాడు జీర్ణించింది.యేం చెయ్యటానికీ పాలుపోవటల్లేదు.

తాత : నువ్వేంచేస్తావు.కూడదని చెప్పి నయాన్నో భయాన్నో వప్పించు... యీలోపుగా నే నాలోచించి మంచిసంబంధం తెస్తాను.గుట్టుచప్పిడికాకుండా ఆమూడుముళ్లూ పడేయిద్దాం

సుగు : వాడు నామాట వినాలిగాని,యితరసంబంధాలతో పని లేనే లేదు....మా తమ్ముడుకూతురే వుంది.అదికూడా వాడంటే పొంగిపోతుంది.

తాత : అయితే యింకేం? 'వెతకబోయినతీగె యెదురైనట్లు' అన్నీ అనుకూలంగానే వున్నాయ్....వాణ్ణి మందలించి వెంటనే వాళ్ళకి వుత్తరం వ్రాయి.

సుగు : అలా జరుగుతే అందంగానేవుంటుంది....వాడు వప్పుకో వద్దూ !

తాత : ఫలితం పొందినా లేకపోయినా మనప్రయత్నం మనం చేయాలి. నామాట విని అలా •చెయ్.అంతా సర్దుబాటవు తుంది. (చంద్రం బయటనుంచి ప్రవేశించి యింట్లోకి పోతాడు.తాత అటూ యిటూ చూసి నెమ్మదిగా) ముందు దానిని నిగ్గతీసి బెదురుపెట్టు.

సుగు : మూడురోజుల్నుంచి అది మా యింటిచాయలకే రావటం లేదు.

తాత : అందాకా వచ్చిందీ వ్యవహారం.బాగుంది.వీడేదో దానికి కావలసిన సౌకర్యాలన్నీ సమకూరుస్తూవుండాలి. యిది మరీ వాటంగావుందని అది వూరుకునుండాలి. ఏంచేస్తాం. మనవుసరం. ఎవరిచేతన్నా ఖబురుచేసి పిలిపించు. (లేచి) పనుంది. నేనలా వెళ్లొస్తానమ్మాయ్.

సుగు . వచ్చాడుగా - పెద్దవాడివి. వాణ్ణి అడిగి చూడరాదూ ?

తాత : (ఆలోచించి) ముందు అలాగే చేద్దామనుకున్నాను. ఆలోచించినమీదట కూడదని తోచింది. ఆ పనేదో నువ్వే చూడు. దీపముండగానే యిల్లు సర్దుకోవాలన్నారమ్మాయి. వస్తానూ (ముక్కుపొడుం పీలుస్తూ నిష్క్రమిస్తాడు)

సుగు : (కళ్లనీళ్లుకారుస్తూ మంచంమీద కూర్చుని ఆలోచిస్తూ వుంటుంది)

చం : (లోపలనుండి ప్రవేశించి తల్లిని సమీపిస్తూ)ఏమిటమ్మా అలా వున్నావు ?

సుగు : ఏం చెప్పను నాయనా! గౌరి పనికి రావటల్లేదు.యింటిపనీ వాకిటి పనీ అన్నీ నేనే చేసుకోవాల్సి వచ్చింది.ఏం చేయటానికి తోచక మధనపడి చస్తున్నాను.

చం : అందుకేనా యీ ఆలోచనంతా!అమ్మా! నువ్వింత అమాయకురాలివేమే! పనిమనిషి మానుకుంటే మరో పనిమనిషిని కుదుర్చుకుంటాం.ఎలుకలున్నాయని యింటికి నిప్పంటించుకుంటామా?

సుగు : గౌరి పని మానుకున్నట్లేనా ?

చం : లేదమ్మా! వాళ్ళ నాన్న నాల్గురోజుల్నుంచీ లేవడంలేదు. అలాంటి వాణ్ణి విడ్చిపెట్టి ఎలావస్తుంది?

సుగు : అది నీ కెలా తెల్సును ?

చం : నిన్ననే కనుపించింది.నెమ్మదించేదాకా నాల్గు రోజులుపాటు రావద్దని నేనే చెప్పాను.

సుగు : ఈసంగతి నాతో చెప్పావుకాదేం ?

చం : అందువల్ల కష్టంగా వుందని నా కేం తెల్సు ?

సుగు : అవున్లే నాయనా! నా కష్టం నీ కేం తెలుస్తుంది? (కన్నీరు కారుస్తుంది)
చం : (ఆదుర్దాగా)అదేమిటే! ఎందు కలా ఏడుస్తావు? ఎవరన్నా ఏమన్నా అన్నారా?
సుగు : (విచారంగా) ఎవ రెందుకంటారు నాయనా! నా ఖర్మమే నన్ను యెక్కిరిస్తోంది.
చం : నీమాటలు అర్థం కావటల్లేదమ్మా.
సుగు : గ్రహించలేకపోతున్నావా నాయనా, మీనాన్న ఎంతపరువుగా బ్రతికారో తెల్సునా?
చం : తెల్సును. ఇప్పుడొచ్చిన నష్టం?
సుగు : నీకేం తెలుస్తుంది? పెద్దదాన్ని, బ్రతికివున్నాను కాబట్టి నీ దుష్ప్రవర్తన నాగుండెల్లో గునపంలాగ పొడుస్తోంది.
చం : దుష్ప్రవర్తనా?
సుగు : అవును.
చం : నేనేం తప్పుచేయలేదే!
సుగు : ఆలోచించి మరీ చెప్పు.
చం : ఆలోచించే చెప్తున్నాను.
సుగు : లోకుల మాటలు వినిపిస్తున్నాయా?
చం : ఏమంటున్నారు? ఎవర్నంటున్నారు?
సుగు : ఎవర్నంటారు? నిన్ను, నిన్నుబట్టి నన్నూను. నువు గౌరిని ప్రేమించావని, పెండ్లిచేసుకుంటానని మాటిచ్చావని ప్రతిచోటా వింటున్నాను. నిజమేనా చంద్రం?
చం : నిజమేనమ్మా.గౌరిని ప్రేమించినమాట వాస్తవమే. పెండ్లి చేసుకుంటానని మాటిచ్చిన మాటా నిజమే. అలా జరపా

లని కూడా మనస్ఫూర్తిగావుంది. అంత మాత్రానికే యింత దిగులా ?

సుగు : దిగులు కాకేమిటి? నా బాధ నీకేం తెలుస్తుంది? సంఘంలో మీ నాన్న సంపాదించినకీర్తికి నువ్వీ విధంగా తప్పుడు పంథాలో నడవటం నీ మనస్సుకి,నీకు నచ్చిందేమో చెప్పు.

చం : తప్పు లేదమ్మా, పెండ్లికి ముందు కావలసింది ప్రేమే. దానికి జాతి మత భేదాలతోనూ, సంఘ సాకులతోనూ పనిలేదు.

సుగు : గౌరి పేద పడుచు.

చం : అయినప్పటికీ శీలవతి.

సుగు : అందుకేనా దాన్ని ప్రేమించింది ?

చం : కేవలం అందుకేనని అపోహపట్టం పొరపాటు.గౌరి అప్సరస లందరికంటె అందంగా వుంటుంది. దాని అందానికి అదే సాక్షి.గుణానికి గౌరి తర్వాతనే మరొకళ్ళని చెప్పుకోవాలి.

సుగు : ఇవేనా కావాల్సింది ?

ం : ఇంతకంటె ఏం కావాలమ్మా ?

సుగు : కాదునాయనా(విచారంతో) వొక్క కొడుకివి.నా అచ్చటా ముచ్చటా నీతోకాక మరెవ్వరితో తీర్చుకుంటాను ? దాన్నే చేసుకుంటే బసవయ్య నా ముచ్చ టేం తీరుస్తాడు ? ఎలా తీరుస్తాడు ? మామయ్య లీలని నీ కిచ్చి పెండ్లి చేయాలని ఎంతో వుబలాటపడుతున్నాడు. అదికూడా నువ్వంటే పంచ ప్రాణాలూవిడుస్తుంది.అయిన వాళ్ళని ఆదరించిచేరదీయటం మన ధర్మం.కాని,దాసీదాన్ని ప్రేమించి పెండ్లి చేసుకోటం తప్పుకాదూ ?

చం: మామయ్యమాత్రం స్త్రీతిపరుడా ?

సుగు : కాదు. కాకపోయినా అయిన సంబంధం.

చం : అందుకోసం నన్ను బాధపెట్టకు. గౌరి మనింట్లోనే దాసీది. నేను దాని ప్రేమకే దాసుణ్ణి....

సుగు : నామాట వినవా ?

చం: క్షమించు. నామనస్సు నానుండి వేరుకాదు. వేరుచేయాలని ప్రయత్నించనూవద్దు. నామీద నీకు పవిత్రపుత్రప్రేముంటే నన్ను గౌరినే పెండ్లిచేసుకోనియ్.

సుగు : (కోపంగా) అలా జరగటానికి వీలుకాదు. లోకం మన్ని చూసి పరిహసిస్తుంది.

చం: పరిహసించేది పరువులేని పశువులు. ఎదటివాని సుఖం చూసి వోర్వలేని వెర్రివెధవలు.

సుగు : చంద్రం (పెద్దగా అంటుంది)

చం: అవునమ్మా.

సుగు : నామాటయందు విశ్వాస మనే దుంటే యిప్పటికైనా మనస్సు మార్చుకో.

చం: మనస్సు మార్చుకోనా ? జారిన మాట, పోయినవస్తువు, చేసిన ప్రమాణం తిర్గిరావటం చాలాకష్టం. నేను చేసినపని నీకు, నీ మనస్సుకీ కష్టంగావుంటే యింట్లోనుంచే వెళ్లి తానులే.

సుగు : (పొంగిపొర్లే దుఃఖంతో) వద్దు చంద్రం, వద్దు. మాతృ హృదయం గ్రహించలేక మట్టిపాలుచేయకు. మీ నాన్న లేనేలేరు. నా ఆశలన్నీ నీమీదే పెట్టుకు ప్రాకులాడు తున్నాను. [సూర్యం ప్రవేశించి ప్రక్కగావుండి వింటాడు]

నామూలంగా నువ్వంత బాధపడకు....నీకు గౌరిమీదే అంత ప్రేముంటే దాన్నే పెండ్లాడి సుఖపడు.

చం : (ఆనందంతో) అమ్మా! (కౌగలించుకుంటాడు)

సుగు : నీ సంతోషమే నా సంతోషం. నీ యిష్టప్రకారం దాన్నే పెండ్లాడి సుఖపడు. (బుజ్జగిస్తుంది)

చం : అమ్మా! నిజంగా నువ్వు బంగారు తల్లివే! (వెళ్ళబోతాడు)

సుగు : చంద్రం!

చం : (నిలుస్తాడు)

సుగు : ఎక్కడికి నాయనా ?

చం : ఈ శుభవార్త నా గౌరికి చెప్పివస్తానమ్మా.

సుగు : అలాగే నాయనా. చూడు, మరోమాట. దాని మేనమామ మూర్తి పేరుపొందిన రౌడీ. దుర్మార్గుడు. వాడు నీమీద కత్తి కట్టాడని విన్నాను. జాగ్రత్త బాబూ.

చం : అమ్మా. నీ ఆశీర్వచనం, గౌరి పవిత్రప్రేమ అలాంటి కత్తుల్ని ఎన్నిటినైనా తునకలుచేస్తాయి .... వస్తానమ్మా [చరచరా వెళ్తాడు. సుగుణమ్మ పమిటచెంగుతో కళ్ళనీళ్ళు తుడ్చుకుంటూ వుంటుంది. సూర్యం చంద్రం పోయిన మార్గాన్ని ఆశ్చర్యంగాచూసి విచారంగా సుగుణమ్మని సమీపిస్తాడు]

సూ : (విచారంగా) పిన్నీ!

సుగు : ఏమిటి నాయనా!

సూ : మీ కీనాటికి ఎంతకష్టంకల్గిందో చూశావా పిన్నీ!

సుగు : మాకా! ఏమిటి సూర్యం ?

సూ : ఏం చెప్పనమ్మా. మీకు కష్టం వస్తే వకటీ నాకొస్తే వకటీనా?
మీ కష్టాన్నే నాకష్టంగా భావించి బాధపడతాను ఏమన్నా
చెప్తే నమ్ముతావో లేదోనని భయపడుతున్నాను.

సుగు : ఫరవాలేదులే చెప్పు నాయనా.

సూ : చంద్రం నా ప్రాణమిత్రుల్లో ప్రథముడు. వాడంత మంచి
వాడు యిండియాలోనే లేడనుకునేవాణ్ణి

సుగు : (విసుగ్గా) సంగతేమిటో చెప్పు ?

సూ : అయ్యో పిన్నీ! ఏం చెప్పను పిన్నీ! యిరుగు పొరుగంతా
యీసడిస్తోన్నది పిన్నీ. సంఘంలో విలువ పూర్తిగా
తగ్గింది. కులనుంచి యీవేళో రేపో బహిష్కరింప బడటా
నికి సిద్ధంగా వున్నారు పిన్నీ.

సుగు : కారణం ?

సూ : (ఏడుస్తూ) ఇంకా తెలియదా పిన్నీ. చెంద్రం మీ యింట్లో
పనిచేసే దాసీముండని ప్రేమించాట్ట.

సుగు : అందుకేనా ?

సూ : ఇంకెందుకనుకున్నావు. ముందన్నా జాగ్రత్తగా వుండ
టానికి ప్రయత్నంచేయి పిన్నీ (గెడ్డంపట్టుకొని) నా మాట
విను పిన్నీ.

సుగు : భయంలేదులే నాయనా ! మన్ని ఎవరూ ఏమీ చేయలేరు.

సూ : అలా అనకు పిన్నీ. అన్ని రోజులూ మనవికావు. దాని
మామ మూర్తిగాడు లేడూ (గుండెలమీద చెయివేసుకొని)
వాడు మండిపడి మారణహోమం చేస్తానంటున్నాడు.
(చెయిపట్టుకొని) వాళ్ల నిప్పటికైనా మంచిమార్గంలో పెట్టు

పిన్నీ. వాణ్ణి మందలించి ఆ ముండని గుమ్మంలోకి రానీయకు పిన్నీ....నామాటవిను పిన్నీ.

సుగు : సాధ్యంకానిపని. ఆపని చేయలేను....చేయటానికి మనస్సు అంగీకరించటల్లేదు....వాడి సంతోషమే నాసంతోషం.... వాడి యిష్టప్రకారం గౌరినేయిచ్చి పెండ్లి చేస్తాను.

సూ : ఆ! (విసుగ్గా నెత్తిమోదుకుంటూ) అదికాదు పిన్నీ. కొరివితో తలగోక్కుంటామా చెప్పు. వాడి అందానికి యీ అప్సర్సే దొరికిందా చెప్పు ? సొరకాయ చెక్కల్లే మొహమూ అదీనూ....సంఘం....

సుగు : సూర్యం! యింక నువ్వేమీ చెప్పద్దు. సంఘంతో నాకు సంబంధం లేదు. సంఘం అనేది మానవ కల్పితమైన మహామ్మారి. ఆ మహామ్మారి మాటల్తో నామనస్సు మారదు. నేను ఆచరించేదికూడా వాడి ఆదర్శాన్నే !

సూ : (నొసళ్లు చిట్లించి) అదికాదు. మీకాలంలో ముందు ప్రేమించుకోటమనేది వుండేదా ? యిప్పుడుమాత్రం ? ఎక్కడన్నా .... ఏయింట్లోనన్నా ....పెండ్లిఅయాక ప్రేమించుకోటమనేది వుంటుంది. అది మన శాస్త్రధర్మం. అనాదినుంచి వస్తున్న ఆచారాల్ని అనుసరించాలి కాని, అర్ధంకాని ఆదర్శాలకోసం ఆయాసపడి ప్రాకులాట్టం మన దేశానికే అప్రతిష్ట..... పనికిమాలిన పేదపడుచుతో -అందులో పెండ్లికాకుండా ప్రేమకలాపాలు జరుపతే మన గౌరవం గోడగడ్డలు కాకుండా వుంటుందా ? చెప్పు పిన్నీ వుంటుందాంట ? పెద్దదానివి. నువు గట్టిగా పట్టు పట్టిచెప్తే

వాడు కాదంటాడా? (కాళ్లపుచ్చుకొని) నాకోసమన్నా మందలించు పిన్నీ-

సుగు : (లేవదీస్తూ) మందలించాను నాయినా. ఫలితం పొందలేక పోయాను వాడి నిర్ణయాన్ని కాదని నే నేమీ చేయలేను.... పోనీ నువ్వూ వాడూ ప్రాణస్నేహితులుగా. నీమాటేమన్నా వింటాడేమో ప్రయత్నించు.

సూ : ఆ! వింటాడు. వింటే నీకాళ్లుచ్చుగోటమెందుకు? (లేచి) తల్లికితగ్గ కొడుకు. కొడుక్కితగ్గ తల్లి. అనుభవించేవాళ్లు మీరే మధ్య నాకెందుకు. (నిట్టూరుస్తూ) వెళ్లొస్తాను పిన్నీ. (వెళ్లబోతాడు)

సుగు : (సమీపించి బుజ్జగిస్తూ) సూర్యం! భయపడకు. గౌరి దాసీదైనా, పేదపడుచైనా, అది మనింటికొచ్చి కాపురం చేస్తుందికాని, చంద్రం దానియింటికి పోడు. మసిబొగ్గయినా మెరుగుపెడ్తే మాణిక్యంలాగ కనుపిస్తుంది.

సూ : మీయిష్టం. డబ్బుకలవాళ్లు ఏపనిచేయటానికైనా సమర్థులు. యిదే నాలాంటివాడుచేస్తే నల్గురూ మొహానుమ్మేస్తారు.... పిన్నీ, నీ కొడుకు ప్రవర్తనసరిదిద్దుకో.లేదా నువ్విష్టపడ్డట్టు నేనిష్టపడను. అది నా భవితవ్యానికే భంగపాటు (పెద్దగా ఏడుస్తూ) యీ కారణంగా నాకూ చంద్రానికీ వున్న స్నేహం తెగతెంపులు చేసుకుంటున్నాను. మీ గుమ్మం తొక్కటం కూడా నాగౌరవానికి భంగమే.

సుగు : (అంధకారంగా) సూర్యం....

సూ : (పెద్దగా ఏడుస్తూ) సూర్యం సర్వనాశనమైనాడు. ఆనాడే చంద్రాన్ని అర్థంచేసుకున్నాను. (గౌరి నెమ్మదిగా ప్రవే

శిస్తుంది. సూర్యం గౌరిని కోపంగా చూస్తూ సుగుణమ్మ తో) వస్తాను పిన్నీ. (చరచరావెళ్తాడు)

సుగు : గౌరీ! పనికి రావటల్లేదేమే ?

గౌరి : మానాన్నకి అమ్మవారు పోసిందమ్మా.

సుగు . అమ్మవారా ?

గౌరి : (విచారంగా) అవునమ్మా. బ్రతుకుతాడనే ఆశలేదు.

సుగు : విచారించకు. భయంలేదు. ఆ తల్లే కాపాడుతుంది.....సరే గాని చంద్రం మీ యింటికి వచ్చాడా ?

గౌరి : లేదమ్మా రాలేదు.

సుగు : నిన్న మొన్నట్లో....(గౌరి 'వచ్చారు' అన్నట్టు తలూపుతుంది) నిన్ను పెళ్లిచేసుకుంటానని మాటయిచ్చాడుటగా!

గౌరి : (భయపడ్తూ) లేదమ్మా.

సుగు : పోనీ ప్రేమించాడా ?

గౌరి : లేదు.

సుగు : నువ్వనా వాణ్ణి....

గౌరి : అ,అ,అ,దీ లే లే లేదు.

సుగు : లోకులు కూసే కారుకూతలు వినవస్తున్నయ్యా ?

గౌరి : ఇల్లువిడ్చి బయటకు రావటంలేదు. యేమంటున్నారు ?

సుగు : చెప్తున్నాను విను. నీమూలంగా చంద్రాన్ని సంఘం తూలనాడుతోంది. నలుగుర్లోనూ నాకుటుంబం నవ్వులపాలౌతోంది. ఇప్పటికైనా నిజంచెప్పి నీతప్పును వప్పుకో.... మాట్లాడవేం?

గౌరి : (నెమ్మదిగా) నిజమేనమ్మా.

సుగు : పెళ్లి చేసుకుంటానన్నాడా?

గౌరి : అన్నారు.

సుగు : అసంభవం. అలా జర్గటానికి వీల్లేదు. చంద్రం లక్షాధికారి. నీవు చంద్రం నీడన బ్రతకవలసిన దానివి. మీ యిద్దరి మధ్య యీ దారుణం జర్గటానికి వీలుపడదు. అందుకు నే నొప్పుకోను. జాగ్రత్త (లోపలికి వెళ్తుంది)

గౌరి : (పెద్దగా ఏడుస్తూ) చంద్రం!

మంచిరోజు కాదోయ్
మనసునిండ కలతేనోయ్ ॥మంచి॥

అల్లుకొన్నా మబ్బు
మాయమయ్యిందోయ్
వలచి పిలచిన నోరు
కట్టుపడిపోయింది
శూన్యసీమగనుండె
ఈ పేదపడుచుకీ ॥మంచి॥

ఎండనక వానసక
ఎదురు చూచిన నాకు
ఏదారి పోవలెనొ
ఏమి కానున్నదొ ॥మంచి॥

సుగు : (ప్రవేశించి) పిచ్చిపిల్ల. భయపడకు.... నీ ప్రేమ ఎలాంటిదో అర్థం చేసుకోవాలని ప్రయత్నించాను. అంత మాత్రానికే యింత విచారమా? చెంద్రం తప్పకుండా నిన్నే పెండ్లి చేసుకుంటాడు.

గౌరి : (పొంగిపొర్లే ఆనందంతో) అమ్మా!

సుగు : (నవ్వి బుజ్జగిస్తూ) అమ్మకాదు. అత్తను. మీ యిద్దరి సంతోషమే నాకూ సంతోషం. ఈరోజే మీయింటికి వచ్చి మీనాన్న కీ శుభవార్త తెలియజేసి, తొందర్లోనే మీ వివాహం జరిపే ప్రయత్నం చేయిస్తాను.

గౌరి : (సంతోషంతో) అమ్మా! (కాళ్ళు పుచ్చుకుంటుంది)

సుగు : అమ్మా అనకూడదు గౌరీ (లేవతీస్తూ) అత్తా అనటం అలవాటు చేసుకో. యిదిగో యీడబ్బు తీసుకుపో. మీకు కావలసినవన్నీ తెచ్చుకోండి. (డబ్బు అందివ్వబోతుంది)

గౌరి : (సిగ్గుతో) వద్దండీ.

సుగు : అలా అనకూడదు. తీసుకో. (చేతికందిస్తుంది)

గౌరి : (ఆనందంగా) విచారంలో సంతోషం-కోపంలో శాంతం-ఆహా!

పాట

నేడే వెలిగె నాజ్యోతి
    ఆశలు వేరుగ యీడేరె ॥నేడే॥
కొనసాగునుగా
    మధుర కోరికలు
కనుపించునుగా
    ప్రణయవీధి
కలవరమొందెను
    నా జీవితము ॥నేడే॥
యిరువుర మొకటె
    పూలమాలగా

విడివడనట్టి
　　　పలపుతీగెగా
కలసిమెలసి
　　　తిరుగాడెదము
ఎంతో హాయిగ
　　　విహరించెదము　　　　॥నేడే॥

[తెర]

# పేదపడుచు

## నాలుగవ రంగం

[స్థలం : రోడ్డు. తాత, తాతవెనక సూర్యం మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు]

సూ : ఇదిగో. నువ్వెన్నన్నాచెప్పు. ఆ పాడుపని నేను చేయను. అంటే చేయదల్చుకోలేదు.

తాత : నా మాట యందు లక్ష్యముంచి మరీ మాట్లాడు. నువ్వీపాటి పని చేశావూ అంటే చంద్రదంతలదన్నిన భాగ్యమంతుడి వవుతావు.

సూ : (విసుగ్గా) నీభాగ్యం బండలుకాను, నా కొద్దయ్యాంటే !

తాత : వినవయ్యా. నీకువచ్చిన భయమేమీలేదు. నీమీద యీగ వాలనియ్యను. నీకా కోరినంతడబ్బు!

సూ : డబ్బుకాసించి ఆపని చేస్తానని ఎప్పుడూ అనుకోవద్దు. పైగా యీగని వాలనియ్యనంటావు. దొంగపని చేస్తే యీ గెందుకు వాల్తుంది. .... పోలీసోళ్ళ లాటీలే ఆన్తాయి. పీకపిసిగి యినపకటకటాలమధ్యకి యిసురుతారు. తెలిసిందా?

తాత : ఆపని చేసేది గౌరిని, నిన్నుకాదు.

సూ : తాతా! తీయని మాటల్తో లోబచ్చుకోటానికి నే నేం కుర్రాణ్ణనుకున్నావా ? సొమ్ము నే నపహరిస్తే గౌరి నెందుకు జైల్లోవేస్తారు ? నీమాటలు ఏమన్నా నమ్మతగ్గవేనా ?

తాత : (నవ్వి) అందులోనేవుంది అంతర్రహాశ్యం - కావాలంటే కార్యరూపంలోకి తెద్దాం...ఏం చెయ్యాలో, ఎలాచెయ్యాలో,

ఎప్పుడుచెయ్యాలో చెప్తాను,రా. (రెక్క పుచ్చు గ్గుంజుతూ) రావయ్యాంటే-

సూ : (విదలించుకొని) అదేమిటయ్యా! నీ అఘాయిత్యం మండి పోను. వద్దయ్యాంటే, రావయ్యాంటావేమిటి ? నీకేమన్నా మతిపోతోందేమయ్యా ?

తాత : మతిపోయేది నీకు.

సూ : (ఆశ్చర్యంగా) నాకా !

తాత : నీకే. అసలు నీ మెదడు మందగించింది.

సూ : అదేమిటి ?

తాత : ఏమిటో చెప్తా విను. గౌరిని మన చంద్రం పెండ్లాట్టం నీ కిష్టమేనా ?

సూ : ఉహుం, లేదు.

తాత : లేనప్పుడు నీ కీ దయెందుకు ?

సూ : దానికీ దీనికీ సమంధ మేమిటయ్యా?

తాత : కావలసినంతుంది. పెండ్లికాకుండా అడ్డుపుల్లలు వెయ్య టానికి నువ్వొప్పుకుంటావా ?

సూ : ఓ. అలాంటివి ఎన్నన్నా చెయ్. ఆనందిస్తాను.

తాత : అందుకోసమే యీ ఆర్భాటమంతాను.

సూ : అదేమిటి తాతా! నీమొహం. దొంగతనం చేస్తే పెళ్లాగి పోతుందా ?

తాత : పెద్దవాళ్లమాటలు వేదాక్షరాలనుకో. యిలా రా. అసలు విరుగుడు చెవిని పదేస్తాను. (చెవిలోచెప్పి) అర్ధమైందా ?

సూ : (ఆలోచించి) ఆ, రైటే - అలాచేస్తే బాగానే వుంటుంది.

తాత : ఇంకా జాగుచేస్తావేం ? రా (రెక్కపుచ్చుకు లాగుతాడు)

సూ : వుండవయ్యా. (రెక్కవిదల్చుకొని) అబ్బ.... రెక్క వూడి పోగలదు....జాగ్రత్త....యింతకీ ఎక్కడికి రమ్మంటావు?

తాత : మూర్తి దగ్గరికి.

సూ : వా డెవడు ?....ఆ రౌడీగాడా ?

తాత : అవును.

సూ : (గ్రుున వెనక్కుతిర్గి భయంతో) అయ్యొబాబో! నేను రాను. (వెళ్లబోతాడు)

తాత : (చెయ్యిపట్టుకొని) భయంలేదు.

సూ : తాతా! పాముతో చలగాటమనేది మన పనికాదు.

తాత : ఏయ్, ఎక్కడో వెర్రివెంకటాయలాగున్నావేమిటి? మూర్తి చాలా మర్యాదస్తుడు. మంచివాడు.

సూ : నీపాలిట మంచివాడే కావచ్చు. నాపాలిట పగపట్టిన పాముతో సమానము.

తాత : ఏం?

సూ : అలా అడుగు. నేను చంద్రం ప్రాణమిత్రులలో ప్రథముణ్ణి అని వాడికి తెల్సును కదా.

తాత : తెలుస్తే?

సూ : తెలుస్తే!....బాగా చెప్పావు.వాడి చేతుల్లో పడ్డానంటే వొక్క దెబ్బతో టపా కట్టాలి. ఎక్కడికి? యమలోకానికి. నేను రాను. కలోగంజో వున్నదాంతోనే తృప్తి పడతాను.

తాత : పోనీ, నీ ప్రాణానికి నాప్రాణం అడ్డం వేస్తాను. రా.

సూ : (తాత చేతులు పట్టుకొని) నన్ను వదలిపెట్టు. కావాలంటే కాళ్ళు పుచ్చుగు బ్రతిమిలాడతాను.తాతా, చెంద్రం స్నేహం

వదలుకున్నా నాకీ బాధెందుకు చెప్పు. కావాలంటే వాళ్ళ యింటివాయలక్కూడా పోను. సరా?

తాత : అదేంమాట? నేను మాత్రం వాళ్ళింటికి పోవటల్లేదా రావటల్లేదా? వాళ్ల మీదుండే ప్రేమచేతనైతేకాని, మరిం కెందుచేతన్నాకాని, గౌరిని విడ్చిపెట్టమని ఎన్నిసార్లు బ్రతి మిలాడాను. విన్నారా!

సూ : నామాట విన్నారు కాబట్టా, నీ మాట వింటానికి.

తాత : అందుకే యిద్దరం కలసి మనమాట నెగ్గించుకోవాలి. మనం వాళ్ళింటికిపోయి వస్తూండాలి. మనపన్లు మనం చేస్తూవుం డాలి. (అటూయిటూ చూచి నెమ్మదిగా) సూర్యం! యీ పని మనం చేశామంటే మనకి ఆరువందల రూపాయలు సునాయాసంగా వస్తాయి. చెరో మూడువందలు పుచ్చు కుందాం.

సూ : (సంతోషంగా) ఆ : మూడువందలే! అయితే యిప్పుడే వస్తాను. (వెళ్లబోయి) తాతా ఎందుకన్నా మంచిది. వాడి దగ్గర ఆరువందలూ నువ్వేతీసుకొని నా మూడువందలూ నాకు పారేయ్.

తాత : (నాలుక చప్పరించి) లాభం లేదయ్యా. యిద్దరం కలసి పోవాలి. యీపని మావల్ల అవుతుందని వాడికి గట్టిగా మాటివ్వాలి. అడ్వాన్సుగా వందో రెండువందలో మనం అత్యవసరఖర్చులక్రింద పుచ్చుకోవాలి.

సూ : (బుర్రగోక్కుంటూ ఆలోచించి) అయితే వొకపని చెయ్యి. నేను బయట నిల్చుంటాను. నువ్వు వెళ్లి వాడితో అంతా మాట్లాడేసి, అడ్వాన్సు తీసుకురా.... నేనుకూడా అక్క

డికి తప్పనిసరిగా వస్తేనేగాని పనిజరగదని నీ మనస్సులో వుండి, నాకు ప్రాణభయం లేదని నీకు గట్టిగా తోస్తే వచ్చి నన్ను కూడా తీసుకుపో. ఏం ?

తాత : సరె, పద.

[యిద్దరూ వెళ్తారు. అనంతరం తెరెత్తబడుతుంది.... టేబుల్ మీద మూర్తి ఫొటో అలంకరించిన స్టాండు, ప్రక్కగా కొన్ని పుస్తకాలు వుంటాయి. దానికి సమీపంలో రెండు కుర్చీలు, దగ్గరగా వాలుకుర్చీ-అందులో మూర్తి పడుకొని సిగరెట్ కాలుస్తూ పత్రిక చదువుతూంటాడు. నాగన్న నెమ్మదిగా ప్రవేశిస్తాడు ]

మూర్తి:నాగన్నా, వెళ్లిన పనేమయింది?

నాగ : ఇంటికా డోరూ లేరు దొరా.

మూర్తి:మనవసరం కాదూ, మళ్ళీ వెళ్లాలి.

నాగ : ఒకసారా?ఆలిముండామొయ్యా!ఆరుసార్లెల్లాను.అంతుంటేనా

మూర్తి:ఊళ్ళో వున్నాడా?

నాగ : వుండ కేడ కెల్తాడు? వున్నాడంట.

మూర్తి:ఎవరు చెప్పారు?

నాగ : ఆల్లింటి పక్క పంతులుగోరు.

మూర్తి:పోనీ, సూర్యం కనుపించాడా?

నాగ : ఎప్పుడు సూసినా వేసిన తల్పులు ఏసినట్టే వుంటాయి. (నవ్వి) ఆలిముండామొయ్యా! అస లాయిన పపంచకంలో వున్నాడో వూడిపోయాడో అసలే తెల్దు.

మూర్తి: మా బావ కెలా వుందో విచారించావా?

నాగ : ఆ! బావంటే గుత్తు కొచ్చింది.అమ్మవారు శెలవిచ్చిందంట. కాని........

మూర్తి:ఏమిటి ?

నాగ : ఏటుంది ? మీ బావ బసవయ్యగోరు ఆరునెల్లమట్టి యింటి బాడుగ యియటల్లేదంట. కామందుకి కోప మొచ్చి కట్టింగా మాట్టాడంట.

మూర్తి : (వికటంగా నవ్వి) ఇదంతా ఎవరి పన్నాగమంటావు.

నాగ : (ఆశ్చర్యంగా)ఏంటి దొరా? ఆలిముండా మొయ్యా. మీరు పన్నిందేనా ?

మూర్తి : ఏమనుకున్నావు ? మూర్తి తల్చుకుంటే పుష్పుమ్ తిప్పలు పెట్టి మూడుచెర్వుల నీళ్లు తాగిస్తాడు.

నాగ : హిహిహిహి. అయ్యగారి వాలకంలోనే కనిపిస్తున్నాయిగా.

మూర్తి : ఆ....తర్వాతేమైంది ?

నాగ : ఏమవుద్ది....మీ గౌర మ్మెల్లి యీ సంగతంతా సెంద్ర య్యతో సెప్పిందంట.

మూర్తి : వాడు దానికి సహాయపడ్డాడనా ?

నాగ : పడ్డాడుగా !

మూర్తి : మూతిపళ్లు విర్గాయా ?

నాగ : ఆలిముండ మొయ్య ఆపట్టం కాదు. యింటికిం దియ్యాల్సిన అద్దెంతా యిసిరికొట్టి, ఆ యిల్లు కాలీ శేయించాడంట.

మూర్తి : (ఈర్ష్యగా) ఇల్లు ఖాళీచేయించాడా !

నాగ : అవును దొరా !

మూర్తి : ఎక్కడికి మార్చాడు?

నాగ : సుప్తాగా ఆల్లింటికాడే ఎట్టేశాడంట.

మూ_ర్తి:(విషపు చూపులతో సిగరెట్టు పీల్చి పుగ వదుల్తూ) పెద్ద చిక్కే వచ్చిందే!

నాగ : ఏం సిక్కు దొరా?

మూ_ర్తి:పన్నిన పద్మవ్యూహం....

నాగ : యింకా యీలుగా అవుద్ది.

మూ_ర్తి:ఏవిధంగా?

నాగ : (నవ్వి)నా మామూలుకాడ నాలుక సవ్వరించకుండా వుండా రంటే-ఆలిముండమొయ్య-ఆళ్ళంతు తేల్సుకోనూ. (మీసం దువ్వుకుంటూ) నాగన్న తల్సుకుంటే ఆళ్ళందర్ని అరసేతులో పెట్టుకు ఆడింపనూ! హుం....

మూ_ర్తి:మూ_ర్తికి కుడిభుజం నువ్వేగా....నీ క్కావలసింది నే నెప్పుడివ్వలేదు....గౌరి నాదికావాలికాని, నిన్ను అందలంలో పెట్టి పూజ చేయించనూ.

నాగ : (నవ్వి)అనుకుండాలే. ఆలిముండమొయ్య! ఆమాటే అనుకుండాన్లే. సరేకాని దొరా! మనం ఎంతో జాగ్రత్తగా పనిసేత్తేనేగాని పసందుగా పన్లీదేరవు.

తాత : ( బయటనుంచి ప్రవేసించి ) నమస్కారం మూ_ర్తి! (కూర్చుంటాడు)

మూ_ర్తి:ఎందుకండి? ప్రయోజనంలేని మొక్కుబళ్లు! వాళ్ల సంసారమంతా నీచేతుల్లో వున్నట్లు చెప్పావు నాచేత అయినకాడికి డబ్బు తగలేయించావు. వెళ్లావు, వెళ్ళినపని ఖాళీచేసుకొచ్చావు.

తాత : నే నేం చేయను చెప్పండి. వాళ్లు నామాటయందు విశ్వాసముంచుతారనుకున్నాను. తల్లిముండకి పెటాల్సిన తంపు

లన్నీ పెట్టాను. చెప్పవలసిన సాకులన్నీ చెప్పాను. గౌరిని పెండ్లాడితే వాళ్ళ గౌరవానికి భంగంకల్గుతుందని. నలుగుర్లోనూ విలువతగ్గి వీధికెక్కుతారని, మూర్తితో విరోధం త్రాచుపాముపగతో సమానమని - అబ్బబ్బ.... వొకటా?-ఎన్నో చెప్పాను. కుఱ్ఱ వెధవ చెంద్రం వినంది తల్లిమాత్రం ఏంచేస్తుంది చెప్పండి?

మూర్తి: మంచిపని చేసింది. ఎకటివాణ్ణీ వెధవని చేయాలని వాళ్ళని కూడా తనింట్లోనే పెట్టుకుంది.

తాత : విన్నాను. అంతా విన్నాను. ఏమీ చేయలేక వూరుకున్నానా? సమయంచిక్కాలి. సర్వం సానుకూలపడాలి.

నాగ : ఆలిముండమొయ్యా! అద్దదేగా నేను సెప్పేదీను.

తాత : తగ్గరా నాగన్నా!

నాగ : సరె. సటిసేర్తాను. తగ్గాను.

మూర్తి: మిమ్మల్నందర్నీ చేరదీసినందుకు మాపన్లన్నీమా చక్కగా నేరవేరుస్తున్నారయ్యా.... డబ్బు మాత్రం ఎక్కడదక్కడ కరిగి పోతోంది. కావలసినపని ఆవగింజలో అరభాగ మన్నా కాలేదు....నాడబ్బు తింటున్నందుకు మీ మీద నాకు సర్వహక్కులు వున్నాయ్.మీచేత ఏ పనైనా చేయిం చుకోవచ్చు....అందుకే నా కోపానికి గురికాకుండా కార్యం సాధించే మార్గం కనిపెట్టండి

నాగ : అదేగా నేను చెప్పేదీను.

మూర్తి : (కోపంగా) నోర్ముయ్.

నాగ : (ఉలిక్కిపడి నోరుమూసుకుంటాడు)

మూర్తి : (పెద్దగా) తాతా మాట్లాడవేం ?

తాత : వేరే దారేదీ కనుపించటల్లేదు....వొక్కటే మార్గం కనుపిస్తోంది.

మూర్తి : ఏమిటది ?

తాత : సూర్యంద్వారా సుగుణమ్మ యింట్లో దొంగతనం చేయించి నేరం గౌరిమీద పెట్టాలి.....

మూర్తి: పెడ్తే !

తాత : దాన్ని అరెస్టు చేస్తారు.

మూర్తి: చేస్తే !

తాత : ఇంకేముంది ? పీటమీద పెళ్లి ఆగిపోతుంది. వాళ్ల పరువు వీధి పా లవుతుంది .... చంద్రానికి అదంటే విరక్తి పుడ్తుంది.

మూర్తి : అందుమూలంగా మనకొచ్చేలాభం?

నాగ : ఆలిముండామయ్యా! అంతా లాబమేగా ?

మూర్తి : నువు నోర్ముయ్.

నాగ : కాద్దొరా !

మూర్తి : అయే దేమిటి ?

నాగ : అట్టా అడుగు దొరా ! దొంగతనం ఎనకాల-(కన్నుకొట్టి) అదికూడా కట్టామంటే కాలుకాలిన పిల్లిలాగ అయిన వాళ్లకోసం ఎదురు సూసుకుంటూ మనగూట్లోకొచ్చి పడుద్ది.

మూర్తి : తంత్రి బసవయ్యుందగా....

నాగ : అట్టా రండి దారికి. మనకి కూనీలుసేయటం, సేయించటం అలవాటేకందా....ఆ నాయాలుగాణ్ణి - ఆలిముండా

మయ్యా! అయిదు నిమిషాల్లో అంతం సేయించి పారే
త్తాను.

మూర్తి : (ఆలోచిస్తూ) ఫలితం వుంటుందాని?....

తాత : తినబోతూ రుచడుగుతారేం....మీరే చూద్దురుగాని.

మూర్తి : సూర్యం చంద్రానికి ఆప్తమిత్రుడు. యీపనికి వాడు
అంగీకరించడు.

తాత : అవసరమైతే వాణ్ణి తమకాళ్లదగ్గరికి తీసుకొచ్చి మరీ
చెప్పిస్తాను. సూర్యం చంద్రంతో స్నేహం చేయటం
లేదు. తమరు అంగీకరిస్తే తమ అండగా పనిచేస్తాడు.
అందుకు సిద్ధంగావున్నాడు.

నాగ : ఆలిముండామయ్యా, యింకేం....మనకింక అడ్డమేలేదు.
(నవ్వుతాడు)

మూర్తి : చంద్రానికి సూర్యానికి స్నేహం ఎందుకు చెడిపోయింది?

తాత : ఇందుకే. పరువుతక్కువ పేదపడుచుతో ప్రణయకలా
పాలు ప్రారంభించినందుకు. మాకు అన్యాయం జర
క్కుండా మాకు రావలసిన బహుమానం మా కిస్తేనా!
హుం, మేమిద్దరం తమకిరెక్కలుకంటే ఎక్కువగా పని
చేస్తాం. మాటయందు నమ్మకంమాత్రం వుంచండి.

మూర్తి:(ఆలోచించి) సరె. సూర్యాన్ని నాదగ్గరకు తీసుకొచ్చి
వప్పించు.

తాత : ఇప్పుడే చెప్పిస్తాను. నాగన్నా! యిలా రా. బయట బొగడ
చెట్టుక్రింద సూర్యం కూర్చునుంటాడు; వెళ్లి తీసుకురా.

నాగ : ఓ, ఆలిముండమొయ్యా! అరనిమసంలో తీసుకురానూ.
(వెళ్తాడు)

మూర్తి:సూర్యం నీతో ఎందుకు రాలేదు?
తాత : తమ మాటచెప్తేనే భయపడుతున్నాడు.
మూర్తి:ఎందుకు భయం?
తాత : వొకప్పుడు చంద్రం స్నేహితుడుకాదూ .... ఆకోపంతో వీడికేదన్నా హానిచేస్తారేమోనని.
మూర్తి: (వికటంగా నవ్వి) అమాయకుడు........తాతా! వొకపని చెయ్. నువ్వీ ప్రక్కగదిలోకి పో సూర్యంతో నేను మాట్లాడతాను.
తాత : చిత్తం...(లోపలకు నిష్క్రమిస్తాడు బయటనుంచి నాగన్న సూర్యాన్ని వెంటపెట్టుకు ప్రవేశిస్తాడు. సూర్యం మూర్తిని చూసి వణికిపోతాడు.
సూ : (వణుకుతూ) త త త తా తేడీ?
నాగ : ఎందుకు ?
సూ : త త త త తాత రమ్మన్నాడన్నావు.
నాగ : ఆలిముండమయ్యా అన్నాను.
మూర్తి : అంటే అన్నాడు కాని, ఎందుకు భయపడ్తావు ?
సూ : (వణికిపోతూ) భ భ భయం కాదండి.యిది వొకరకమైన జబ్బు.
మూర్తి : అరె. కాళ్లలా వణికిపోతున్నాయేం ?
సూ : అ అ అ జబ్బుకు లక్షణాలే అవి.
మూర్తి : (నవ్వి) మళ్లీ రాకుండా మంచి మందివ్వనా ?
సూ : వ వ వద్దు....అ అ అ అదే పోతుంది.
మూర్తి : ఇక్కడి కెందుకొచ్చావు ?

సూ: ఆ! నాగన్న తాతగారు పిలుస్తున్నారని తీసుకొచ్చాడు.ఏరా నాగన్నా! అయ్యగారితో చెప్పవేం? అడగం డింకాను.... ....వెళ్ళొస్తానండి. (రెండడుగులు వేస్తాడు)

మూర్తి (పెద్దగా) ఆగు.

సూ: (ఉలిక్కిపడి ఆగుతాడు)

మూర్తి: వచ్చినవాళ్ళ పనికాందే వెళ్ళటానికి వీల్లేదు.

నాగ: ఆలిముండామయ్యా అంతేదొరా! (నవ్వుతాడు)

సూ: (నాగన్నని కోపంగాచూసి మూర్తితో) పనేదో శెల విప్పండి.

మూర్తి: (కోపం అభినయిస్తూ) నాగన్న నిన్నెందుకు తీసు కొచ్చాడో తెల్సునా?

సూ: (గుడ్లు మిటకరిస్తూ,గుటకలు మింగుతూ)తె తె తెలియదు.

మూర్తి: (ఈర్ష్యచూపిస్తూ) నా కసి తీర్చుకోటానికి.

సూ: (బాగా వణుకుతూ) రామ రామ. నేనేం చేశానండి? పొర పాటునన్నా తమర్ని పల్లెత్తుమా టన్లేదే! నన్ను క్షమిం చండి—నా కేమిటో భయంగావుంది. వెళ్ళిపోతాను.

మూర్తి:వీలుపడదు. నే నడిగిన ప్రశ్నలకి సమాధానంచెప్పి మరీ వెళ్ళు.

సూ. (నీరసంగా) ఆలస్యంచేయకుండా అడగండి మరి.

మూర్తి:చెంద్ర మెక్కడ?

సూ: ఇంటిదగ్గర

మూర్తి:ఏంచేస్తున్నాడు?

సూ: తెలియదు.

మూర్తి:ఎందువల్ల?

సూ: నేను వాళ్ళింటికి వెళ్లటం మానేశానండి.

మూర్తి:(కోపంగా) ఊఁ. అబద్ధమాడుతున్నావ్. జాగ్రత్త.

సూ: లేదు, ప్రమాణపూర్తిగా వెళ్లడంలేదు.

మూర్తి: పెళ్ళెప్పుడు?

సూ: ఎవరిదండి?

మూర్తి:గౌరిది. ఎప్పుడు?

సూ: అవుతుందండి.

మూర్తి:ఎవరితో?

సూ: చెంద్రంతో.కాదుకాదు, (నాలుకకరుచుకొని)మి మి మీతోనే మీతోనే.మీతోనే.

మూర్తి:(రెండడుగులు వేసి)ఏయ్. వేళాకోళంగావుందా?

నాగ: అలిముండమొయ్య అంటించండి ఆరుదెబ్బలు.

సూ: (నాగన్నతో నెమ్మదిగా) నీకేమన్నా మతిపోతోందా?

మూర్తి:గౌరిని చెంద్రం పెండ్లాట్టం నీ కిష్టమేనా?

సూ: లేదండి.

మూర్తి:కారణం.

సూ: ఆ పెండ్లి సుతలాం నా కిష్టం లేదండి. భాగ్యవంతుడు చెంద్రం దాసీపని చేసుకు బ్రతికే గౌరిని చేసుకుంటానంటే నే నొప్పుకోనండి.

మూర్తి:ఆ సలహా నీమిత్రుని కిచ్చావా?

సూ: ఇచ్చానండి. 'ససేమిరా'అన్నాడు.

మూర్తి:అయితే ఆ పెండ్లి నీకు యిష్టంలేదన్నమాటేగా!

సూ: అక్షరాలా యిష్టంలేదండి.

మూర్తి:పీటలమీదపెళ్ళి జరక్కుండా తతంగంచెయ్యటానికి అంగీక రిస్తావా?

సూ : (వినయ విధేయతచూపుతూ)చిత్తం. అంతకంటే కావల సిందేముంది?

మూర్తి:నానుండి నీకు భయమేమీలేదు. నిన్ను నా ఆప్తుల్లో అగ్రగణ్యునిగా ఆరాధిస్తాను....నేను చెప్పినట్లు విను.... నీవు కోరినంత డబ్బిస్తాను.

సూ : హిహిహిహి ...చెప్పారండి. అంతా తాతగారు చెప్పారండి

మూర్తి:అన్నిటికీ అంగీకరించినట్లేగా?

సూ : (ధైర్యం తెచ్చుకుంటూ) కావాలంటే చేతిలో చెయ్యేసి చెప్తాను....చెప్పేదొకటి, చేశేదొకటీ మన జాతకంలోనే లేదు.

మూర్తి : (ప్రక్కకుతిరిగి) తాతా !

తాత : (ప్రవేశించి) ఏమిశెలవు ?

మూర్తి : సూర్యాన్ని నీకు అందగాయిస్తున్నాను.... యిద్దరూకలసి కార్యాన్ని సాధించండి.

తాత : చిత్తం

సూ. (నెమ్మదిగా తాతతో) మరి డబ్బుసంగతి ?

మూర్తి : ఏమిటా రహశ్యం ?

తాత : అవసరపు ఖర్చులక్రింద ఏదో ....

మూర్తి : నాగన్నా, వాళ్ళక్కావలసింది యిచ్చిపంపు.

నాగ : సిత్తం....(సూర్యంతో) అలిముండామయ్యా! ఆరంభం లోనే అడవాస్సు కొట్టేశారు. (వెళ్ళబోతాడు)

మూర్తి : వినండి. నామాట శ్రద్ధగా వినండి. రేపు సాయంకాలా
నికి సగంపని పూర్తికావాలి, జాగ్రత్త!
తాత : చూస్తారుగా యీ సారి. (మీసం మెలేస్తాడు)
సూ : (వెకిలిగా నవ్వి) బలేగా అన్నావు.
నాగ : ఆలిముండామయ్యా రండయ్యాంటే-
[నాగన్న, తాత, సూర్యం లోనికి పోతూవుంటారు.
మూర్తి విరగబడి వికటంగా నవ్వుతాడు]

(తెర)

# ★ సం సా రి ★

అధికారి, సినిమాజగత్, పల్లెపిల్ల, పేదపడుచు మొదలగు సాంఘిక నాటకాలువ్రాసి, ప్రదర్శించి, యావత్ ఆంధ్రప్రజా నీకంచేతా అఖండ ఆశీస్సులనందుకుంటూ, నవరసప్రదంగా రచనలు సాగించి నేటి నాటక లోకంలో పేరు ప్రఖ్యాతులు గడించిన ఆదర్శ హాశ్యనటులు శ్రీ సీతంరాజు వెంకటేశ్వరరావు గారిచే రచించబడి, అచ్చయి, ప్రదర్శనానికి సిద్ధంగావున్న మరో మచ్చుతునక. నేడే వెలువడింది.

సావధానంగా చదివి, సక్రమంగా ప్రదర్శించి, సలక్షణంగా పేరుపొందండి. నాటకం పద్యాలు లేకుండా ప్రదర్శించినా పసందుగా వుంటుంది. ఏజెంట్లకి మంచి కమీషను యివ్వబడును.

ప్రతి వెల రూపాయిన్నర - కాపీలకై ముందుగా
త్వరపడండి.

# వేదపడుచు

## అయిదవ రంగం

(స్థలం. చంద్రంయింట్లో దొడ్డివైపు వరండా. సమయం: రాత్రి పది కొండు గంటలు. బసవయ్య పట్టెమంచంమీద పడుకొని నిద్రపోతూ వుంటాడు. సమీపాన మరో మంచంమీద పక్కవేసి గౌరికోసం సిద్ధంగా వుంటుంది. కొద్దిదూరంలో హరికేన్ లాంపు వెలుగుతూ వుంటుంది దానికి ప్రక్కగా కూజా, గ్లాసు కిటికీ వూచలగుండా చంద్రకాంతి లోపల పడ్తూంవుంటుంది. గౌరి కిటికీ వూచల్ని పట్టుకు చంద్రుణ్ణిచూస్తూ పాడుతూవుండగా తెర ఎత్తబడుతుంది)

రావోయి రావోయి
ఓ చందురూడ
మెల్లగా రావోయి
నా చెందురూడ ॥రావో॥
కిలకిలా నవ్వాలి
మెలమెలా మెరవాలి
హాయిహాయిగ నా
కానందమును గూర్చ ॥రావో॥
మనసులో రేకెత్తె
నా ప్రేమ వూహాలు
నవ్వుతూ నానుండి
అందుకో రావోయి ॥రావో॥
చల్లని వెన్నెల్లొ
పూవులా ఘుమఘుమలో
నీ ప్రేమ బాసలతొ
నన్ను నవ్వించంగ ॥రావో॥

బస : (నిద్రనుండిలేచి) చాలా పొద్దుపోయింది. యింకా పడుకో లేదేం గౌరీ?

గౌరి : నిద్రపట్టటల్లేదు....పడుకుంటా.

బస : చంద్రంకోసమేనా యెదురుచూసేది ?

గౌరి : కాదు నాన్నా (సిగ్గుపడ్తుంది)

బస : (నవ్వి) పిచ్చితల్లీ. పెండ్లి కాందే ప్రియునికోసం ఎదురు చూడకూడదమ్మా. శాస్త్రం సమ్మతించదు లోకం విరగబడి నవ్వుతుంది. మనం నిజంగా అదృష్టవంతులం కను కనే సుగుణమ్మతల్లికూడా యీ పెండ్లి చేయాలని పట్టు పట్టింది. దిక్కులేక దరిద్రులమై అల్లాడిపోతున్న మన్ని దయార్ద్ర హృదయంతో దారి చూపి దరికి చేర్చుకుంది... కాకపోతే దగాచేయాలని ఎదురుచూసే మీ మామయ్య మర్మాలతో క్రుగ్గి మసైపోయేవాళ్లమే !

గౌరి : అవును నాన్నా, మామయ్య ప్రతిజ్ఞ విన్నావా ?

బస : (నవ్వి) పిచ్చితల్లి! పటుత్వంలేని ప్రతిజ్ఞలు చేశాడని భయ పడకు. ఎప్పుడో వాడిపాపం వాణ్ణే దహిస్తుంది. ఆనాడు మన కెదురుతిర్గిన సంఘం యీనాడు కాకపోయినా, మరో నాడైనా వాణ్ణి వీధికి లాక్కపోదు. (నీరసంగా ఆవలించి) ఉ....ఆయాసంగా వుంది. మాట్లాడలేను. పోయి పడుకో తల్లీ.

గౌరి : అలాగే నాన్నా (ఆలోచిస్తూ చంద్రుణ్ణి చూస్తూవుంటుంది)

బస : ఏమిటమ్మా ఆలోచన? దేన్నిగురించి?

గౌరి : నిండు చెంద్రునినాట్యం చూస్తున్నాను నాన్నా....

బస : (నవ్వి) వెర్రితల్లి....చాలుగాని వెళ్ళి పడుకో.

గౌరి : (సిగ్గుతో పడుకొంటుంది)

బస : (నెమ్మదిగా లేచి, కూజాదగ్గర కెళ్ళి నీళ్లు త్రాగొచ్చి మంచంమీద కూర్చుంటాడు) తల్లి లేకపోయినా గౌరిని అల్లాయిముద్దుగా పెంచుకుంటూ, దాన్నిచూసి ఆనందిస్తూ రోజులు గడుపుతున్నా....గౌరికి నా చేతిమీదుగా పెండ్లి చేయలేనేమోనని భయపడ్డాను. ఆ అవకాశం దానంతటదే దొర్లు కొచ్చింది. కాస్త ఆరోగ్యం చేకూరగానే ఆ మూడు ముళ్లూ పడేయించే ప్రయత్నాలు ప్రారంభిస్తాను. దాన్ని దాని అత్తవారింటికి పంపాక నే నెప్పుడు పోయినా నాకు చీకూచింతా వుండదు....సుగుణమ్మ తల్లి ఆనాడు చల్లని మనసుతో చేరదీయకపోతే యీ నా డెక్కడుండేవాళ్ళమో! అంతా ఆ పరంధాముని మాయా నాటకం.(ఆవలించి)ఉ.... అమ్మ... (అంటూ నడుం వాలుస్తాడు.కొంత సేపటికి తెరలో దొంగలు పడ్డట్టు హడావిడిగా మాటలు వినపడ్తాయి. బసవయ్య లేచి కూర్చుని గాబరాగా వింటూవుంటాడు.

తాత : (తెరలో) ఆలోచిస్తారేం! రండి. దొంగతనం చేసింది ఆ ముండేనని తేలిపోయిందిగా....(సుగుణమ్మ, చంద్రం, తాత, సూర్యం విసురుగా ప్రవేశిస్తారు)

సూ : (పెద్దగా నవ్వి ఆక్షేపణగా) ఓహోహో - చూడండి. దొంగముండ ఎల్లా నిద్రపోతోందో .... నిజం నిద్రవుతే యింత హడావుడి జర్గుతుంటే మెళుకువ రాకుండావుంటుందా?....ఛా ఛా ఛా....యిలాంటి అలికిముండలకి చను విచ్చి యింట్లో చేరదీయటమే పెద్ద తప్పు.

బస : (గాబరాపడ్తూ నెమ్మదిగాలేచి) ఏమిటి ? అదేంతప్పు చేసింది ? శాంతంగాచెప్పు సూర్యం.

సూ : (తెల్లబోయిచూస్తూ) ఆరిముండాకొడకా! పుస్తన్నా ముడి పళ్లేదు. అప్పుడే నీకు నేను సూర్యం అయ్యాన్రా ? జాగ్ర త్తగామాట్లాడు. కోరలు పీకిస్తాను.

బస : క్షమించండి. పొరపాటున అన్నాను.

సూ : వూరుకుంటే అదే అలవాటు చేసుకుంటావు, నీకేం నీతా నియమమా ? (పెద్దగా) ముండని యీడవండి మంచం మీద నుంచి.

గౌరి : (త్రుళ్లిపడి లేచి అందర్నీ ఆశ్చర్యంగా చూస్తూ సుగుణమ్మని సమీపిస్తుంది)

సుగు : (దూరంగానెట్టి) ఛీ ఫో-సిగ్గులేని ముదనష్టపుదానా! ని న్నేం చేస్తే పాపముంది ? మా పాలిట పెనుఘాతంలాగ దాప రించింది కాకుండా దగ్గిరకూ్కడా వస్తున్నావ్ ?

గౌరి : (ఏడుస్తుంది)

బస : (అర్థంకాక)ఏం చేసిందమ్మా?దానిమీద అంత మండిపడి పోతున్నారు.

సుగు : (ఈర్ష్యగా) ఏం చేస్తుంది? మా కొంప దోచేసింది.

చం : (కోపంగా) ఇంట్లోతిని యింటివాసాలు లెక్కెట్టింది.

గౌరి : (అంధకారంగా) ఆ!

సూ : (నవ్వి) ఎంత నంగనాచివే! ఏమీ ఎరగనట్టు నాటకమాడు తున్నావ్? ఛా ఛా ఛా (సుగుణమ్మతో) చూశావా పిన్నీ! నమ్మి ప్రపంచంలో మంచి అనేది ఎవ్వరికీ చేయకూడదని యిప్పటికైనా తెలుసుకో!

గౌరి : చెంద్రంగారూ (ఏడుస్తూ సమీపిస్తుంది)
చం : (కోపంగా) ఎందుకు? మనస్సుకి మనస్సిచ్చినట్లు కపటంగా నటించి నన్నూ. నా వంశాన్ని నామర్దాపరిచిందికాకుండా నిఖవునా నాశనం చేద్దామనుకున్నావా?

గౌరి : లేదు.నే నేపాపం ఎరుగను. నేను నిర్దోషిని.

సూ : అంతేలే! దొరికేతే దొంగ! దొరక్కపోతే దొర....ఆ జాతి లక్షణమే అంత.

బస : (కోపంగాసూర్యాన్నిచూస్తూ)మాటలుహద్దుమీరుతున్నాయి.
చం : చేసినపనికి హద్దు మీర్తాయా? అంతం చేస్తాయా?
బస : ఆవేశంతో అనవసరంగా అనుమానిస్తున్నారు.
చం : అనుమానించటం దేనికి? కళ్ళకి కనుపిస్తుంటేను.
బస : ఏమిటయ్యా నీ కగనుపించేది?
చం : నీ కూతురు చేసినపని....
బస : ఏం చేసింది?

చం : ఏం చేసిందా? (ఈర్ష్యగా చిరునవ్వు నవ్వి) పాలుపోసి పెంచినవాళ్లకి పరాభవం చేసింది....అయినా నన్నడుగుతావేం?దాన్నే అడిగ తెల్సుకో....(జుట్టుపట్టుకు గుంజుతూ) ఏమే!

బస : (పెద్దగా)వదులు. చేసినతప్పు రుజువుచేసి దండించటం ధర్మం.

చం : రుజువుచేయాలా?(నవ్వి) ప్రత్యక్షంగా కళ్ళకి కనుపిస్తుంటే. పేదవాళ్ళని ఆదరించినందుకు నా జీవితం అంధకారం చేసింది. మరొక రంకుమొగుణ్ణి మరిగి, మమకారంతో

మంచి చెడ్డలు లేకుండా యింట్లోపడి అయిదువందల రూపాయలు అపహరించింది.

గౌరి : ఆ! అంతా మోసం. ఆపని నేను చేయలేదు.

చం : (పళ్ళు కొరుకుతూ) రంకులాడి! నిన్నేంచేస్తే పాపముందే? లేదంటే సరిపోతుందనుకున్నావా? వాణ్ణి మరిగిన మాయలాడివి, నన్నెందుకు మోసగించావు. వంచకీ!

గౌరి : (విసురుగా చెంద్రం చెంపమీద కొట్టి) నోర్ముయ్. (ఏడుస్తూ తల వంచుకుంటుంది)

చం : (చెంప సవరించుకుంటూ వుంటాడు)

సూ : చూశారా? అందరూ చూశారా? యింకా ఏంకాలం చెప్పండి పాపిష్టికాలం! యింతమందిలో ఆడది ధైర్యంచేసి, చేసిన తప్పుచాలక మగవాణ్ణి చెంపదెబ్బ కొట్టిందంటే, ఎంత నామర్దాపనో చూడండి! (గాబరాపడ్తూ) చూస్తావేం పిన్నీ? పాడుముండని పీకపిసక్క....

చం : చాలు....జర్గిన అవమానాలు చాలు. దాన్ని బయటికి పంపండి....దొంగముండని నాయెదురుగుండా లెమ్మనండి. (విసురుగా వెళ్లి అక్కడున్న మంచంమీద కూర్చుంటాడు)

బస : దాసీగా వున్నంతమాత్రాన దానిమీద ధర్మంలేకుండా దొంగతనాన్ని పడేయకండి. మీ కూడు తింటున్నంత మాత్రాన వెనకముందులు ఆలోచించకుండా నోటికొచ్చిన కూతలు కూయకండి. అన్నంలేకపోయినా మీకంటే మేమే పరువుగా బ్రతుకుతున్నాం.

సూ : నోర్మూయ్యరా పక్షీ ! సిగ్గులేక మాట్లాడుతున్నావు. కన పడుతుందిగా మీ బ్రతుకు.

బస : నీలాంటి భ్రష్టులుంటేసరి, ఎందుక్కానపడదు.

సుగు : అదంతా అనవసరం. గౌరీ! అపహరించిన డబ్బేంజేశావు ?

గౌరి : డబ్బును అపహరించింది నేనుకాదు.

తాత : (కోపంతో) ఎంత నంగనాచివే ! నువు కాదేం ? కాకపోతే యింకెవ్వరు ? యిప్పటికైనా నిజంచెప్పి, నీతప్పు వొప్పుకొని క్షమాపణ కోఱకో-

బస : (విచారంగా) గౌరిని నిష్కారణంగా నిందిస్తున్నారు. పేదవాళ్లమని అంతచులకనగా చూట్టం ధర్మంకాదు. (చం ద్రం కాళ్లుపుచ్చుకొని) గౌరి తెలియని ఆవేశంలో మీకు చేసిన పొరపాటుని మర్చిపొండి. దాని మనస్సు గ్రహించండి. నామాట విని దాసీదని దగాచేయకండి.

చం : దాసీదికాదు. మా అందరిపాలిట దరిద్రదేవత....నాగన్నని మరిగి నన్ను వంచించాలని చూసిన విశ్వాసఘాతకి.

బస : (శూన్యంగాచూస్తూ) చంద్రంగారూ !

సూ . ఏడిశావుకాని, కాలయాపన చేయక యిల్లు ఖాళీచేయండి.

బస : ఇంత అర్ధరాత్రివేళ ఎక్కడికి పొమ్మంటారు ?

తాత : గౌరి నువ్వూ కలసి కట్టకట్టుకు గోదావరిలో దూకండి.

బస : (గౌరిని చూస్తూ విచారంగా) గౌరీ !

గౌరి : నాన్నా....(తెల్లబోయిచూస్తూ) నిజాన్ని గ్రహించలేక నామీద నిందవేసి అపనిందపాలు చేస్తున్నారు .... డబ్బు అనేది విచిత్రమైన వస్తువు ...పేదల పాలిట పెనుభూతం. ....అపహరించే దొంగల్లో అనుభవించే దొంగల్లు.

తాత : అయితే నాగన్నేవచ్చి అపహరించాడంటావా ?

గౌరి : ఆసంగతి నాకు తెలియదు.

సూ : పోనీ నాగన్నంటే ఎవరో తెల్సా ?

గౌరి : (తలూపుతూ) తెల్సును.

చం : వాడికీ నీకూ కల బాంధవ్యం ?

గౌరి : ఏమీలేదు....

గౌరి : వాడు మూర్తికి కుడిభుజం.... వాడితో ఎప్పుడూ తలెత్తి మాట్లాడెరుగను.

సూ : (హేళనగా) ఓహో. తలవంచుకు మాట్లాడావా? మరి చెప్పవేం?

గౌరి : లేదు.... యింతమందిలో వొక అబలని అక్రమంగా నేర స్తురాల్నిచేసి పరాభవిస్తున్నారు.

సూ : ఇంకా యెందుకు చెప్తావులే! అంతా తేటతెల్లమయిందిగా. (చంద్రాన్ని సమీపించి) యిప్పటికైనా అర్థమైందా? పరువు తక్కువ సాంప్రదాయంతో సంబంధం వద్దయ్యాంటే విన్నావా? యిప్పుడు చూడు. ఎడమొహం పెడమొహం.... (సుగుణమ్మని సమీపించి) పిన్నీ. యిప్పుడైనా నామాటవిని, పీనుగుల్ని వెంటనే యింట్లోనుంచి తరిమెయ్.... మన పీడ వదలిపోతుంది.... బ్రతికి బయటపడతాం.

బస : (సుగుణమ్మ కాళ్లు పుచ్చుకొని) అమ్మా.... మీరే తల్లిగా భావించి మీ నీడని బ్రతుకుతుంది. నాగౌరి.... తల్లినీడన బ్రతికే అమాయకురాల్ని చూసి సహించని చవటలు ఎవరో తంపులు పెట్టారని తరిమెయ్యటం ధర్మంకాదు. మేంకోరింది కోరినట్లు మీరేయిచ్చి ఆదరిస్తుంటే, దొంగతనం చెయ్యా

ల్సినపని దాని కెందుకుంటుంది? గౌరిని ఆపాటి గ్రహించ లేకపోతున్నారా?

సూ : గ్రహించకేం? యింతాకనే గ్రహించాము.రం....కు....మ గ....డి....కోసమని—

గౌరి : (కోపంగా) నోర్ముయ్.యిదంతా మమ్మల్ని అవమానించాలని పన్నిన పన్నాగం .నాగన్నంటే యిరుగు పొరుగు వ్యక్తి. మూర్తి చేతిలో కీలుబొమ్మ డబ్బుఅనే మహమ్మారి కోసం ఏం చేయటాన్నికైనా వెరవని వక్రబుద్ధి. యెదటివాళ్ళ మానాభిమానాల్ని మంటకలపాలని అర్రులు జాచే అప్రయోజకుడు. అలాంటి నీచుణ్ణి ప్రేమించి, ఆ దౌర్భాగ్యుని కోసం యీ దొంగతనం చేశానని నిష్కారణంగా నేరాన్ని మోపటం అవమానకరం(సుగుణమ్మతో) అమ్మా! ఆడదాని మనస్సు ఆడది గ్రహించినట్లు మగవాళ్లు గ్రహించలేరు....నామాటలు విశ్వసించండి ప్రమాణంచేసి చెప్తాను. నిజం తెలుసుకోలేక నామీద....

సూ : అగ్గిలాగా భగ్గుమంటున్నారా? (వికటంగా నవ్వి వెనక్కి లాగుతాడు)

సుగు : అంతా తెల్సుకున్నాను.యిలాంటివాళ్లని తెలుస్తే యింట్లో అడుగుపెట్టనిచ్చేదాన్నేకాదు. ఆనాడే గెంటేదాన్ని. తెలియక మోసపోయానని చింతిస్తూ, నాగౌరవానికి నేనే చిచ్చుపెట్టుకున్నానని ఏడుస్తున్నాను. నిజంగా నువ్వే పాపం ఎరక్కపోతే అర్ధరాత్రివేళ అయిదువందలూ వాడి కెలా వెళ్లాయి?

గౌరి : (నీరసంగా) ఆ! నన్నింకా నమ్మటల్లేదా?

బస : (ఆవేశంతో) ఎవ్వరిద్వారా పంపింది ? ఎవరు చెప్పారు ?

సూ : (నవ్వి) అదికూడా చెప్పనా! నాగన్న ముత్తవతల్లి ముసలి ముండద్వారా! యీ సంగతి బయటపెట్టింది మనం. (తన్ని చూపించుకుంటూ ప్రక్కన వ్రేలాడుతున్న తాడు తీస్తాడు)

బస : అంతా మోసం. వట్టిది....కల్మషంతో పన్నిన కుట్ర!

సూ : (వికటంగానవ్వి, భీకరంగా చూస్తూ, గౌరిని సమీపిస్తూ వుంటాడు)

చం : (వొక్కసారి సూర్యాన్నిచూసి అక్కడ వుండలేక చర చరా వెళ్తాడు)

సూ : వట్టిదో గట్టిదో వినిపిస్తానుండు. (గౌరిని సమీపించి) నిజం చెప్పు.... దెబ్బకి దేవేంద్రుడు ఝడుస్తాడు .... (నవ్వి) మాట్లాడవేం ? దొంగముండా ! (విసురుగా కొడ్తాడు. గౌరి కెవ్వన కేకవేస్తుంది. లేనివోపికతో బసవయ్య సూర్యానికి అడ్డువెళ్ళి చొక్కా పట్టుకుంటాడు)

బస : (పెద్దగా) ఆగు. నువు మనిషివేనా ? ఎందు కా పసికూన నలా కొడ్తావు ? నీ చేష్టల్నిబట్టి చూస్తే యిదంతా నీవే కల్పించిన కట్టుకధగా వుంది. తల్లిపాలు త్రాగి తల్లి రొమ్మని గుద్దేరకంకాదు. (నెమ్మదిగా నీరసంతో) నిజంచెప్పు. గౌరి దొంగతనం చేస్తుండగా నువు చూశావా? (స్థాయిపెంచి) చెప్పవేం ? నాగౌరి దొంగతనం చేస్తుం డగా నువు చూశావా ? (గొంతు చించుకుంటూ చొక్కా పట్టుకు గుంజుతూ) మాట్లాడవేం ? నా గౌరి దొంగతనం చేస్తుండగా నువ్వు చూశావా ? (విడిచిపెట్టి రొప్పుతూ తూలిపోతాడు)

సూ : (క్రిందికి త్రోసి) దొంగని దొంగంటే వుసిమురిమి మీద కొస్తున్నాడు. ముండాకొడుకు. (సుగుణమ్మతో) పిన్నీ! జాగుచేస్తే లాభంలేదు. వాళ్లని యింట్లోనుంచి తక్షణం బయటకు గెంటు. లేదా అరెస్టు చేయించు. రెంటి లోనూ ఏదోవొకటి వెంటనే చేయించు.

సుగు : (విసుగ్గా) సూర్యం.... ఆ పనేదో మీరే చేయండి.

బస : (మాట్లాడలేక మాట్లాడుతూ బాధగా) మానాభిమానాలు మంటకలిశాక నేను బ్రతికిమాత్రం ఎవర్ని వుద్ధరిస్తాను. ఆనాడు ఆవేసించిన అమ్మవారు తీసుకుపోయినా నాకీ కష్టం వుండేదికాదు....కన్నకూతురి కష్టాలు చూసి కుళ్ళిపోటా నికే యింకా యీ భూమిమీదున్నాను. (నెమ్మదిగా) అమ్మా....గౌరీ!

గౌరి : (ఏడుస్తూ) నాన్నా! (సమీపిస్తుంది)

బస : (బుజ్జగిస్తూ నెమ్మదిగా) భయపడకమ్మా! తానొకటి తలిస్తే దైవ మొకటి తల్చింది. కూర్చున్నపీట తీసుకు న్నారని కృంగిపోకు....కష్టాలు వోర్వలేక పొరపాటు నన్నా భగవంతుణ్ణి పల్లెత్తు మాటనకు....భగవంతుడు అం దర్నీ వొకే మాదిరిగా సృష్టించడు. కల్మష హృదయాల కారు కూతలే మనసుఖాన్ని మట్టిపాలుచేసి మన్నీ కాడికి తెచ్చాయి. మీ అమ్మ పోయినప్పటినుంచి యిప్పటి వరకు నిన్ను కడుపులో పెట్టుకు పెంచుకున్నాను. నాఆశ అక్కడే ఆగిపోయింది. (బాధగా)యిదే నా జీవితా నికి అంతిమ దినం. చాలా దుర్భరంగా నడుస్తోంది.

గౌరి : నాన్నా....(కౌగిలించుకుంటుంది)

బస : [తలనిమురుస్తూ] ఆ రుణం కూడా తీరిపోయింది. నిన్ను ఏకాకిని చేసి యీ విశాల ప్రపంచంలో విడిచిపోతున్నాను.

గౌరి : (భయంగా చూస్తూ) నాన్నా....

బస : (బాధగా మాట్లాడలేక మాట్లాడుతూ)నాన్నకీ నీకూ రుణం తీరి పోయింది....నీపట్ల సత్యం జయించి తీరుతుంది. యిదే నా అంతిమ దీవెన. బ్రతుకు మీద విరక్తి కల్గి ఆత్మ హత్య మాత్రం చేసుకోకు తల్లీ (నెమ్మదిగా) ఆ....త్మ హ....త్య....చే....సు....కో....కు....త....ల్లీ! (మరణి స్తాడు]

గౌరి : (పొంగిపొర్లేదుఃఖంతో పెద్దగా) నాన్నా! (మీదపడి ఏడుస్తుంది)

సుగు : ఆ! (ఆదుర్దాగా గౌరి బసవయ్యలని చూసి విచారంతో నిష్క్రమిస్తుంది)

సూ : (తాతతో)అసలే నీరసంగావున్నాడుకదూ, మూర్ఛపోయుం టాడు.

గౌరి : (ఏడుస్తూ) నాన్నా! న న్నీ లోకంలో ఏకాకిని చేసి పోయావా? చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకొని, ప్రే మించిన ప్రియునిదృష్టిలో దొంగగా మారి,దూరమై, చివరకు నిన్నుకూడా కల్మషపూరితుల కొరుకూతలకి కానుకగా సమర్పించిన యీ పాపిష్టురాల్ని యింక ఆదరించి చేరదీసేవా శ్లైవరు? అన్యాయానికి ఆలవాల మైన యీ పాపిష్టిలోకంలో ఆడవాళ్లు,అందులో నాలాంటి అబలలు అదృశ్యం కావలసిందేనా? న్యాయం, ధర్మం, నీతి నామరూపాల్లేకుండా నాశనమైన యీరోజుల్లో నా

లాంటి పేదపడుచుల గతేంకావాలి ? పరువులేక పాపాన్ని యిరికించుకు పాడై పోవలసిందేనా ? నాన్నా .... నాన్నా నా గతేంకాను.(మీదపడి ఏడుస్తుంది)

సూ : తాతా ! (ఆలోచిస్తూ) యింతకీ బసవయ్య బ్రతికున్నా డంటావా, చచ్చాడంటావా ?

తాత : (నవ్వి) ఇంకెక్కడి బసవయ్య ? వా డెప్పుడో చచ్చాడు.... పట్టు.... యీడ్చి పారేద్దాం

సూ : దగ్గరకెళ్లి నాడి చూడు.ఎటొచ్చి ఎటుపోయినా మంచిది ?

తాత : ఇంకా అనుమానమే ! (పరిశీలించి) నేను చెప్పలేదూ?.... అంతే !

సూ : (భయంతో గుడ్లుతేలేస్తూ) ఆ : చచ్చిపోయాడా ? (వణికి పోతాడు)

తాత : (నవ్వి) వాడు చస్తే నీకు భయమేమిటి ?

సూ : (భయంగా) కాదు. బలవంతంగా చచ్చినవాళ్లు దెయ్యాలై పీక్కుతింటారంటారు. అదీ నా భయం .... (నెమ్మదిగా) చూడు,నరుని కంటపడకుండా వాణ్ణి బయిట కీడ్చేయ్యాలి, లేకపోతే మనపనీ తర్వాత యింతే ! (బసవయ్యని చూపిస్తాడు) ఎందుకంటున్నాన్నంటే యీపని మనం చేశామని మన్ని కట్టుకుపోతారు.

తాత : పిచ్చివాడా ! మన్నెందుకు కట్టుకుపోతారు ? యింటివాళ్లే యేదో చేశివుంటారని సుగుణమ్మని, చంద్రాన్ని కట్టుకు పోతారు.

సూ : అదేమిటయ్యా ! వాళ్లు పెద్దవాళ్లు, డబ్బుగలవాళ్లు.

తాత : అయితే,

సూ : అయితే గియితే యీపని వాళ్లే చేశారని మన్ని చూపిస్తారు.

తాత : నమ్ముద్దూ ?

సూ : ఎందుకు నమ్మరు?బసవయ్యకీ వాళ్ళకీ ఎంత జో స్తీవుందో అందరికీ తెలిసిన విషయమే! అందుకని యీపని మనమే చేశామంటారు. మధ్య మనం యిరుక్కునిచావాల్సిందే! వాళ్లా కలిగినవాళ్ళు. అవసరమైతే పదిమందికీ పదొందలు పారేశన్నా అలా చెప్పిస్తారు. తీసుకోరంటావా ? మన వాళ్లందరికీ అలవాటే ! (నెమ్మదిగా) అందరిసంగతీ అలా వుంచు. మనం చేసిన పనేమిటి ? లంచానికాసిం చేగా యీ పనిచేసింది. (కొంచెం పెద్దగా) అందుకే యీడ్చి బయట పారేద్దాం. తెల్లవారేసరికి నడివీధిలో కనుపిస్తాడు. మనమీది కేమీ రాకుండా బయటివా ళ్లెవరో చంపిపారేశా రనుకుంటారు.

తాత . (నెమ్మదిగా) గౌరిముండ చెప్పదూ?

సూ : అయితే ముందు దాన్నే యీడ్చిపారేద్దాం.తర్వాత నెమ్మదిగా వచ్చి వాణ్ణి పట్టి ప్రక్కవీధిలో పారేద్దాం.తెల్లారగానే ఏమునిసిపాలిటీవాళ్ళో కాటికి యీడుస్తారు

తాత : అయితే సరే,పట్టు.

సూ : పద.(గౌరిని సమీపించి)ఏయ్ ముండా!నిండినింట్లో నీ గోలేమిటి?పోలీసువాళ్ల కంటపడకుండా పారిపో, లేకపోతే దొంగవని పట్టుకుంటారు.

గౌరి : (ఏడుస్తూ)ఎవర్ని పట్టుకునేది?ఎవరు దొంగ?మా నాన్నని అన్యాయంగా పొట్టనెట్టుకుని యీ పాడుపని చేస్తారా? యిదేనా ధర్మం?

సూ : (భయంగా అటూయిటూ చూస్తూ)అయ్యబాబో! ఎవరన్నా వింటారు-చూస్తావేమిటయ్యా-నోరు మూయ్యవయ్యా.

గౌరి : (పెద్దగా)ధర్మం,న్యాయం పాటించలేని మీలాంటిపశువుల్ని ....(తాత బలంగా నోరుముస్తాడు. చెరొకరెక్క పట్టుకు బయ టకీడుస్తూ వుంటారు)

గౌరి : (పెద్దగా)వదలండి. నేను నిరపరాధిని....మానాన్నకీ నాకు ఎడబాటు జేయకండి... నామాట వినండి.అయ్యో సుగుణమ్మగారూ,చంద్రంగారు,చంద్రంగారు!..(మళ్లీ నోరుమూసి బలంగా యీడ్చుకుపోతారు.అనంతరం తిర్గివచ్చి పీనుగుని సాయంపట్టి తీసుకుపోతారు.సుగుణమ్మ (ప్రవేశించి అటూయిటూ చూసి పడిపోతుంది.తాతా సూర్యంలు ప్రవేశిస్తారు)

తాత : మన పీడ వదిలిపోయింది.

సుగు : (పెద్దగా)బాబాయి ! చెంద్రం కనుపించలేదు. ఎక్కడికి పోయాడో తెలియదు.మతి చెడిపోయి అర్ధరాత్రి ఎక్కడికో వెళ్లిపోయాడు....వెళ్లండి. వాణ్ణి తీసుకురండి.బాబాయి, నాకు పుత్రభిక్ష పెట్టు.(మూర్ఛపోతుంది)

తాత : (గాభరాగా సుగుణమ్మను పరిశీలించి) ప్రాణభయం కల్గ లేదు ...వుదయాన ఏ డాక్టరుకో చూపిద్దాం. నేనువెళ్లి చెంద్రాన్ని తీసుకొస్తాను.సుగుణమ్మని జాగ్రత్తగా కాపాడుతూవుండు.(చెరచెరా వెళ్తాడు)

సూ : (భయంగా అటూయిటూ చూస్తూ)చివర కిదంతా నాచావు కొచ్చినట్టుందే!అర్ధరాత్రి పీనుగు పోయి నింట్లో బిక్‌బిక్ మంటూ వంట్రిగా నాకీ శిక్షేమిటి?వాడిసంగ తెలాగున్నా నా పని అయ్యేటట్లుంది.సమయం చూసుకొని చచ్చిన బస

వయ్య దెయ్యమె వచ్చి పీక్కుతిన్నా దిక్కులేదు.యిప్పు డేమి చేయను? (తెరలో కుక్కలు మొరుగుతున్నాయి) అయింది(గుడ్లు మిటకరిస్తూ)నా పని అయింది.గౌరిముండ పోలీసువాళ్ళనో బొగ్గులోన్కి పంపుతోంది. (ధైర్యం తెచ్చు కుంటూ) ఛా ఛా ఛా ఏదో పిరికిగా అంటానే కాని (అటూ యిటూ చూసి)ఏమోలే, కాలం నమ్మ తగిందికాదు. కష్టతో ఏ పనన్నా చేస్తారు. (మళ్లీ కుక్కలు మొరుగుతునాయి) ఆ!యీ మాటు బాగా మొరుగుతున్నాయ్!ఏదో అలికిడి లేక పోతే అవ్వెందుకు మొరుగుతాయి.వచ్చింది, నా రోజూ వచ్చిందిరా నాయనా!(గుండె బాదుకుంటూ) తాత ముండా కొడుకు నాకు మర్మం పెట్టి మాయమయ్యాడురా! చివరికి పట్టుపడేది నేనే!యే దెయ్యం పట్టుకున్నా నన్నే....ఏమిటి గత్యంతరం.(ఆలోచించి)ఆ!బలే వుపాయం తట్టింది (గబ గబా వెళ్ళి అక్కడున్న మంచం నడుంగా కూర్చుని కళ్లు మూసుకొని ఆంజనేయ దండకం చదువుతూ వుంటాడు)

( తె ర )

# పేదపడుచు

## ఆరవ రంగం

(స్థలం బజారు: ప్రజలు అటూయిటూ నడుస్తూ వుంటారు. గౌరి దిగులుతో నడవలేక నడవలేక నడుస్తూ వుంటుంది. ముష్టివాడు పాట పాడుతూ ప్రవేశిస్తాడు)

కనరా .... .... .... .... .... .... .... ....

పేదల జీవిత - బాధను వినరా ॥కన॥
మర్మము విడచి - మా ఖర్మము చూసి
ధర్మము చేయుచు - దరికి జేర్చగా ॥కన॥
ఆవరించిన - ఆకలి బాధతొ
అలమటించే - అంధ జీవులకు
అన్నము పెట్టి - ఆదరించగా మా
పేదల జీవిత - బాధను వినరా ॥కన॥
భోగాలతొ - కులికే మీరు
ఆకలితొ - అంత మొందే
బీదల ఆకలి - తీర్చగ కనరా
పేదల జీవిత - బాధను వినరా ॥కన॥

(నిష్క్రమిస్తాడు)

గౌరి : (విచారంగా) లోకం....పాపిష్టి లోకం .... ఎదుటి వాళ్ళ సుఖాన్ని చూసి వోర్వలేక కళ్ళల్లో కారం పెట్టుకునే కాలంలో యీ దౌర్భాగ్యురాలి మొర విని జాలిపడే దయామయులెవరు? రక్తాన్ని చెమటగామార్చి, కష్టపడి కూలి

చేసి కడుపులో పెట్టుకు పెంచి పెద్దచేసిన తండ్రిని పో గొట్టుకొని. దిక్కులేని పక్షిలాగ అల్లాడిపోవలసిందేనా ? నన్ను కనికరించి, నా మొరవినే కరుణాహృదయులు కరువైన యీ పాపిష్టిలోకంలో యీ అభాగ్యురాల్ని ఆదరించి, నా నిర్దోషిత్వాన్ని నిరూపించే దాత లేరా? దిక్కుమొక్కు లేనివాళ్ల జీవితాలు నిరర్ధకం .... వాళ్లీ ప్రపంచంలో వుండటానికే అనర్హులు. వాళ్ల ఆదర్శానికి మార్గదర్శకంగా కనుపించేది చివరకి ఆత్మహత్యే ! అంతకంటే వేరేమార్గం లేదు.

[తెరలో "ఎన్నికష్టాలొచ్చినా ఆత్మహత్యమాత్రం చేసుకోకు తల్లీ" అన్నతండ్రిమాటలు గుర్తుచేయాలి] అవును నాన్నా,నీమాట ప్రకారమే నడ్చుకుంటాను. నా నిర్దోషిత్వాన్ని నిరూపించి, నేను నిరపరాధినని లోకంలో ప్రతిధ్వనించేదాకా నిద్రపోను....అందాకా నీ ఆత్మ శాంతి పొందదని నాకుతెల్సును .... అందుకోసం యిప్పుడు ప్రయత్నం చేస్తాను. (అంటూ వెళ్తుంది. తెరలో మళ్ళీ బిక్షకుని పాట వినబడుతుంది)

(చంద్రం పిచ్చివాడులా వెర్రిచూపులు చూస్తూప్రవేశిస్తాడు)

చం : (పిచ్చిగా నవ్వి)ఆడది పురుషుని పాలిట శత్రువు....ఆడదాన్నినమ్మి ఎంతమంది చెడిపోలేదు?అందులో నేనొకణ్ణి. ప్రేమించి పెండ్లి చేసుకుంటానంటే మోసం....పెళ్లికి బదులు నడివీధిలో నవ్వుల పాలవటం....మనస్సుకి మనస్సు ఇచ్చి. తీయని మాటల్తో నా ప్రేమను మలినంచేసి దొంగతనం చేసి నాగన్నకి డబ్బు పంపటం....ఆదరించి

చేరదీసిన వాడి బ్రతుకు బజారు పాలు చేయటం....యిది యీరోజుల్లో జరిగే వింత నాటకము....న్యాయానికి యివి రోజులు కావు. మానాభిమానాలు మంట కలిశాక బ్రతికి ప్రయోజన మేముంది? అలాంటి ఆడదాన్ని ఏంచేస్తే పాపముంది?(వెర్రిగా నవ్వి)వొక పురుషునికి వొక భార్య ....వొక ఆడదానికి వొకభర్త....అంటారే కాని ఆచరించే అంఘలెవరన్నా వున్నారా? ఎందుకుంటారు?....నాగన్నని మరిగిన గౌరి యీ సంగతి యిదివరకే చెప్పకూడదూ?

ఆత్మ. (తెరలో)అక్కడే పొరబడుతున్నావ్.పాపం అమాయకు రాలు. గౌరి ప్రేమ నిష్కళంకమైంది.చెప్పుడు మాటల్తో నీ పవిత్ర ప్రేమను బూడిదలో కలిపి పాడుచేసుకున్నావు. ....లోకం యెదుటి వాడి సుఖం చూసి వోర్వలేని అప్రయోజకులతో నిండి పోయింది....ఆమె మనస్సును గ్రహించ లేక ఆమె ప్రేమను పాడుచేసి పాప పంకిలంలో కీడుస్తున్నావు

చం: (తెల్లబోయి చూస్తూ) ఏమిటీ!

ఆత్మ: (తెరలో) అవును. పేదపడుచు ప్రేమ పవిత్రమైంది. (నవ్వి) పిచ్చివాడా! యిప్పటికైనా నిజం తెల్సుకో....

చం: (వికటంగా నవ్వి)తెల్సుకున్నాను.సర్వం తెల్సుకున్నాను.... (పెద్దగా నవ్వి పిచ్చి చూపులుతో) ఆ పాపిస్టురాల్ని చేరదీస్తే యింకా తెల్సుకుంటాను....

[సూర్యం. తాత, నాగన్న ప్రవేశిస్తారు. చంద్రం వాళ్లని చూసి ప్రక్కకు తప్పుకొని వాళ్లమాటలు వింటూవుంటాడు]

సూ : వద్దయ్యాంటే విన్నావా ? అన్నివిధాలా చెడ్డాం.

తాత : మన మేం చెడ్డాం .... చంద్రం చెడ్డాడు. మనోవ్యాధితో మంచమెక్కి సుగుణమ్మ చెడింది. అంతే!

సూ : అంతేలే— మన కేదన్నా మూట వళ్లో పడ్డట్టయితే వాళ్ళు చెడ్డారనే దిగులు నాకు లేకపోయేది. పని అయ్యేదాకా యిస్తానన్నాడు. పనయాక పదిరూపాయలు మన మొహాన పడేశాడు.

నాగ : ఇదిగో! ఆలిముండామొయ్యా నాకుమాత్రం యిచ్చాడా? గౌరమ్మకీ మూర్తికీ పెళ్లికాగానే మనందరికీ పండగే! ఆనాడు - ఆలిముండామయ్యా - మనమేగా పెళ్లిపెద్దలం. (మీసం మెలేస్తాడు)

సూ : ఆ! అవుతుంది అర్థాన్నం.వాడి పేరు చెప్తేనే అది వుమ్మేస్తుంటే యింకా అయ్యేదేమిటి వుద్ధరి.

నాగ : అవుతుందో లేదో నీకు తెల్సా? హుం, నాగన్నంటే మామూలు మడిశనుకున్నావా ? యింటోయించి యెల్ల గొట్టేవుపాయం మీ రాలోచించారు.ఎల్లగొట్టించారు.మనం (సకిలించి)అది యెల్లేదార్లో కల్సుకొని మాయపన్ని మంచి మాటలుసెప్పి మూర్తిగారింటికి తీసుకెల్లి దింపాను. యిం టుందా బాగుపడుద్ద. నేకపోతే - ఆలిముండామొయ్యా! (గుడ్లు తేలేసి) యింతే!

సూ : అవునుకదా! అది అంతే, మనం యింతేగా!

తాత : అంటే....

సూ : అర్థానం....తాతా! నువ్వు వెయ్యిచెప్పు, లక్షచెప్పు, అనుకున్న కాడికి నా మూడువందలూ నా చేతిలో గుమ్మరించక

పోయావా యీ సంగతంతా చెంద్రంతో చెప్పి మీపని పటిస్తాను.

తాత : (నవ్వి)యింకా వాడెక్కడున్నాడు....పౌరుషం కోసం వా డెప్పుడో బలవంతాన చచ్చిపోయుంటాడు.

నాగ : అది సంగ తలావుంచు. మూర్తి పట్టుదలంటే ఏటో అనుకుంటుండావు. ఎన్ని కూనీలు సేశాడో తెల్సా?ఆలిముండామొయ్యి! ఆయన ౩ది ఆటకిందుంటుంది....మెదిలినా, యీ గుట్టు యితర్ల సెవిలో వేసినా ముందు నీపాణాలకే మొప్పం.

సూ : నా ప్రాణం పోయినా సంతోషమే!ఫలితం లేకపోయినా స్నేహితుణ్ణికూడా పాడుచేస్తాననుకున్నావా?తాతా! నే నక్కడికి రాను. యింటికి పోతున్నాను. దీపం పెట్టేలోపుగా మన డబ్బు మనకి తెచ్చి యివ్వకపో (సకిలిస్తాడు)
[చెంద్రం వికటంగా నవుతూ పిచ్చివాడులా ప్రవేశిస్తాడు. తాత, సూర్యం, నాగన్నా గాబరాపడి పారిపోబోతారు]

చం : [పెద్దగా]సూర్యం![పట్టుకుంటాడు. సూర్యం వణికిపోతాడు తాతా, నాగన్నలు పారిపోతారు]

సూ : (మాటతడబడుతూ) అ అ అ నీకోసమే వెదుకుతున్నా. పిన్ని వెతుక్కురమ్మంది.

చం : విన్నాను;అంతా విన్నాను. గౌ రెక్కడ?

సూ : నా కేం తెల్సు?

చం : నీకు తెల్సునని నాకు తెల్సిందిలే. (వురిమిచూస్తూ) చెప్పు. లేకపోతే నీకంఠం పిసికి చంపుతాను.

సూ : నేను నీ స్నేహితుణ్ని.

చం : అవును. నమ్మను. మోసపోయాను. నీలాంటి మిత్రద్రోహిని నిల్చోబెట్టి కాల్చాలి. (నవ్వి) పిల్లి పాలుత్రాగుతూ ఎవ్వరూ చూడ్లేదనుకుంటుందిట. మీ కుట్రంతా విన్నాను. నిజం తెల్సుకున్నాను. యిప్పటికైనా నిజం చెప్పకపోతే నీ ప్రాణాలు నీకు దక్కవు. నా గౌరి ఎక్కడ? ప్రాణానికి ప్రాణమిచ్చి మెలిగే ప్రాణస్నేహితుడవని విశ్వసించాను గాని, యిల్లాంటివాడివని తెలుస్తే ఆరోజే నిన్ను మా యింటిచాయలకు రానిచ్చేవాణ్ణికాదు. నన్నుచూస్తే నీ కీ కడుపుమంటెందుకు? నేను నీకుజేసిన ద్రోహ మేమిటి? నువు మనిషివికాదు,పశువ్వి.కాదు,అంతకంటే అధముడివి. నీలాంటి వాజెమ్మలు వున్నంతకాలం ప్రపంచంలో అనాచారాలు ప్రబలమై అధోగతిపాలవ్వవలసిందే!

సూ : అదేమిట్రా. నన్నంటావేమిటి? .... నే నెల్లాంటివాణ్ణో నీకు తెలియదుట్రా? బాగుంది, చేసే దొకడు, అనుభవించే దొకడు.

చం : ప్రేమజీవుల్ని విడదీసి యీ పాపాని కొడిగట్టుకున్న దెవరు? (పెద్దగా) చెప్పు.

సూ : చెంద్రం!నన్నెందుకు చంపుతావ్? నే నే పాపం ఎరుగను. యిదంతా తాతయ్యగాడు చేశాడు. వెళ్ళి ఆయన్ని అడుగు; అన్ని వివరాలు తెలుస్తాయి.

చం : సూర్యం!నా గౌరి ఎక్కడుందో నీకుతెల్సును.యింకా నన్ను సాధించాలని ప్రయత్నిస్తున్నావు. నిజం చెప్పు [చొక్కా పట్టుకొని]లేకపోతే యిప్పుడే చంపేస్తాను.[పెద్దగా]చెప్పు.

సూ : (కాళ్లు పుచ్చుకొని) చంద్రం! క్షమించు. గౌరిని మనం యింట్లోంచి వెళ్ళగొట్టాక నాగన్న వెంటపెట్టుకుని తీసుకు పోతుండగా మాత్రం నేను చూశాను. అంతకంటే నాకేం తెలియదు. నామాట నమ్మ.

చం : నమ్మతగ్గ అవకాశంలేదు. పోనీ ఎక్కడకు తీసికెళ్లాడో చెప్పు.

సూ : ఆవేళ మూర్తియింట్లోపెట్టి తాళం వేశారు.... తర్వాత యేం చేశారో నే నెరుగను.

చం : ఆ! [తన్ని] ముష్టుడా, ని న్నేంచేస్తే పాపముంది? యిప్పటి కైనా నీ తప్పు నువ్వు తెల్సుకో. స్నేహితుడనని క్షమించాను కాని, గౌరి నాకు దక్కకపోతే మీ అంతు తేల్చుకు వదుల్తా నని మర్చిపోకండి. [చెరచెరా వెళ్తాడు]

సూ : (నెమ్మదిగా లేస్తూ) భగవంతుని దయాంటూ ప్రాణంతో వదిలిపెట్టాడు. లేకపోతే నాపని అయిపోయేదే! యిప్పుడు నాపని ఏమవుతుందో నాకే తెలియటల్లేదు.... చెప్పకపోతే వీడి చేతిలో చచ్చేవాణ్ణి చెప్తే వాడిచేతిలో చావాలి. మధ్య మనకి చావుతప్పదు....(ఆలోచించి) ఆ! మంచి వుపాయమే తట్టింది. వెంటనే వెళ్ళి మూర్తికి వాణ్ణిగురించి అబద్ధాలు చెప్పానంటే మనమీద అనుమాన ముండదు.... లేకపోతే మనపని క్లోజ్. (చెరచెరా వెళ్తాడు)

( తెర )

# పేదపడుచు

## ఏడవ రంగం

(స్థలం: మూర్తి రహస్యగృహం. సమయం: సాయంత్రం 5 గంటల ప్రాంతము. వొక కుర్చీ, దాని పక్క నొక టేబులు, దానిమీద పడగవిప్పిన పాము బొమ్మకాని, నోరుతెరచిన పులిబొమ్మ కాని వుంటుంది. గోడకు మూర్తి ఫొటో తగిలించి వుంటుంది. తెర నెమ్మదిగా యెత్తబడుతుంది. గౌరి విచారంగా పాడుతూ వుంటుంది.)

గౌరి :

గాలిలో నా బ్రతుకు
తేలిపోతుందేమొ
నా బ్రతుకు భారమై
బరువాయెనా ధరకి ॥గాలి॥
ఏదారి పోతుందో
ఏమి కానుందో నాకు
ఎదురాయెనో నేడు
లోకమే నా విధికి ॥గాలి॥
కారుమబ్బులె నన్ను
అలుముకున్నాయేమొ
కటికచీకటే న
న్ను ఆవరించునేమో ॥గాలి॥

(ఏడుస్తూ) ఇదేనా ధర్మం? ఆడదంటే అంత చులకనై పోయిందా? అహంకారంతో వళ్లు తెలియక కామం ఆవేశించిన అప్రయోజకుల దురహంకారానికి ఆడది-అందులో

నాలాంటి బీదరాలు ఆహుతి కావలసిందేనా ? డబ్బు అనే మహామ్మారిని పట్టి దాన్ని ఆరాధించి పూజించేవాళ్లు పేదవాళ్ల పాలిట పెనుభూతాలై చెలరేగవలసిందేనా? పేద వాళ్లంటే ఎందుకూ కొరగాని గడ్డిపూచకంటె కనాకష్టంగా చూసే ధనికుల దౌర్జన్యాలను అరికట్టలేని ప్రభుత్వం దేశాని కేం సేవ చెయ్యగల్గుతుంది? అందరూ సమంగా వుండాలని, సంఘంలోనూ, దేశంలోనూ కుళ్లు కూలిపోవాలని గొంతు చించుకుంటూ వుపన్యాసాలిచ్చే ఘరానా పెద్దమనుష్యులకి నాలాంటి పేదపడుచు కష్టాలు కనుపించటల్లేదా? పేదవాళ్ల సుఖాన్ని చూసి సహించలేని ధనికులకు పేదవాళ్ల మీదా కడుపుమంటెందుకు ? నా తండ్రికీ నాకూ దూరంచేసి, నిష్కారణంగా నామీద నేరాన్నిమోపి, నన్ను ఆదరించి చేరదీసిన నా ప్రియునికి నాకు ఎడబాటుకల్గజేసిన పరమ నీచాగ్రేసర చక్రవర్తులకి నే నేం ద్రోహంచేశాను?

మూర్తి :(నెమ్మదిగా ప్రవేశిస్తూ) హహహహహా!.... నీవు చేసిన ద్రోహం నీకు తెలీదూ....నీకు మేనమామనైన నన్ను ప్రేమించకపోవటమే నీవు చేసిన పెద్దద్రోహం....

గౌరి : ఒక పేదపడుచుని భర్తనుండి దూరంజేయటం....

మూర్తి : ధర్మంకాదు. కాని మొదట్నించీ నీభర్తను నేనే నంటు న్నానుగా :

గౌరి : ఆమాట నే ననుకోవద్దా ? చంద్రాన్ని ప్రేమించి, ఆయన ప్రేమకు నా జీవితాన్ని అంకితంచేశానే. ఆకంటితో నిన్నెలా చూస్తాను?అందుకని దయయుంచి యీ జన్మకి నా భర్త చంద్రమేనని మరువకు.

మూర్తి : (నవ్వి) అసంభవం. అలా జరగదు.....చెంద్రం నిన్ను ప్రేమించినమాట వాస్తమే. పెండ్లిచేసుకుంటానని మాట యిచ్చినదీ నిజమే. కాని రోజులు కలసిరాకపోవటం మూలాన వాళ్లింట్లో నేరస్తురాలవయ్యావు. దాంతో వాడి ప్రేమ యెండుకొమ్మలాగ విరిగిపోయింది... విరక్తి చెం దిన ప్రేమకు విరుగుడు లేదు....

గౌరి : ఉంది....నా నిర్దోషిత్వాన్ని నిరూపిస్తే ఎప్పటికైనా ఫలి తం వుంది. నీవు చేసినతంత్రం నాకు పూర్తిగా తెలిసింది. నామీద నిష్కారణంగా యీ నేరాన్ని పదేయించింది నువ్వే! కామాంధకారం కళ్లకి పొరలుగాకమ్మి యీ కపటనాటకం ఆడించిన సూత్రధారుడవూ నువ్వే. (విచా రంగా) కంటికి రెప్పలాగా కన్నతల్లికంటే ఎక్కువగా కాపాడిన సుగుణమ్మగారికి నామీద లేనిపోని సాకులు చెప్పించిందీ నువ్వే. నన్ను ఆదరించి నాకు అన్నం పెట్టిన ఆమె హృదయంలో తుఫాను లేవతీశావు .... ఛీ .... నీ మొహం చూస్తేనే పాతకం చుట్టుకుంటుంది.

మూర్తి : (నవ్వి) నీ కోపంతో నాహృదయం మరీ ఆదుర్దాపడు తోంది....పడిననేరం పరితపిస్తే మాయదు....నీవు నన్ను తిరస్కరించినా, తిట్టినా, ఏంచేసినా సరే నేను నిన్ను వొక్కటే కోరుతున్నాను. అందుకే యీ ప్రయత్నాలన్నీ

గౌరి : (ఈర్ష్యగా) ఏమిటీ?

మూర్తి : అర్థంకాలేదా అందాలభరిణా....నీహృదయ పంజరంలో యీ మదనమోహన మూర్తిని శాశ్వతంగా బంధించు కోమని కోరుతున్నాను. యెన్నో అక్రమాలుచేసి సం

పాదించిన యీ ఆస్థి అంతా నీదే. నన్ను, నా ఆస్థిని శాశ్వతంగా పరిపాలించు.

గౌరి : (కోపంతో) ఛీ! నీవు చేసిన పరువుతక్కువపన్లు, నీచాతినీచాలూ, నలుగురునోళ్ళలోనూ నాట్యంచేస్తున్నాయి. యెంతమంది నీ దుష్ప్రవర్తన్ని చూసి కాండ్రించి నీ మొహాన వుమ్మేస్తున్నారో యిప్పటికైనా తెల్సుకోమని హెచ్చరిస్తున్నాను.

మూర్తి : (నవ్వి) సంపూర్ణ యౌవనాన్ని పొందికూడా సుఖానికి దూరమౌతున్నావు. చూడు, నీవు దూరమౌతున్నకొద్దీ నాలో ప్రేమ, అనుభవించాలనే ఆసక్తి యెక్కువౌతున్నాయి. తొణికిసలాడే నీ సౌందర్యాన్నిచూసి పరితపిస్తూ అవకాశంకోసం యెదురుచూస్తూ ఆరాటపడుతున్నాను. రా....నన్ను ప్రేమించు.

గౌరి : (నవ్వి) నీవు చేసిన అత్యాచారాలకి నిన్ను ప్రేమించాలా?

మూర్తి : పిచ్చిదానా! (నవ్వి) గతం నాస్తి. జరిగినవన్నీ మర్చిపో.... మేనమామని, నీమంచికోరే వాణ్ణి-నన్నపార్థం చేసుకోక ప్రేమించి నా జీవితరథానికి సారథిగా వుండు. ఆనందంగా నా ఆశను యీడేర్చు .... ఆ ఆశతోనే ఎదురుచూస్తున్నాను.

గౌరి : ఎదురుచూసే నీ ఆశను అథఃపతనం చేసుకో.....నీ అత్యాచారాలు నాగుండెల్లో నిప్పులు చెరుగుతున్నాయి. నా యౌవనాన్ని నిర్మూలనం చెయ్యాలనే దురాశతో ఎదురుచూస్తున్నావు.

మూర్తి : కాదు. మనసారా ప్రేమించాను.

గౌరి : నీది పవిత్రప్రేమ కాదు. కామం తీర్చుకోటానికి కారణంగా పన్నిన పన్నాగం.

మూర్తి : పరిహసిస్తున్నావా ?

గౌరి : (ఆశ్చర్యంగా) నీతో పరిహాసమా ? ....పరువు ప్రతిష్టలు పాటించక పశువులాగ ప్రగల్భాలుకొట్టి పాపాలు బ్రద్దలు చేసుకోబోతున్నావని, అందుమూలంగా నామనస్సు చంద్రంనుండి వేరుకాదని గట్టిగా చెప్తున్నాను.

మూర్తి : (వికటంగానవ్వి) చంద్రం! (విరగబడి వికటంగానవ్వి) నమ్మిన వాళ్ళని నాశనం చెయ్యటంలో వాడంతనీచుడులేడనీ, అలాంటి అవివేకుల్ని ఎప్పుడూ, ఎలాంటి విపరీత విపత్కర, కష్ట, నష్ట, దుష్టసమయాల్లోకూడా నమ్మకూడదనీ నీ క్షేమంకోరి చెప్తున్నాను. చెప్పినమాటలయందు లక్ష్యముంచి చెవిని పట్టించుకుంటే బాగుపడతావు.

గౌరి : నాబాగు నీకక్కర్లేదు.... దయయుంచి నోరుమూసుకొని కారుకూతలుకూయక కాలికి బుద్ధిచెప్పు.... కాలయాపన చేస్తే....

మూర్తి : అకాలమరణం పొందుతానా ?

గౌరి : అవును. ఆడదంటే ఒకరికి తన పవిత్రప్రేమను అంకితం చేసి మరొకనీచుడికి శరీరాన్ని వినియోగించేటంతటి నీచురాలు కాదు.

మూర్తి : (వికటంగా నవ్వి) ఇలా డాంబికాలు కొట్టేవాళ్ళని ఎంతమందినో చూశాను. ఆడదానివి— అందులో నాక్కావలసిందానివి....నామాట కాదని కాల్దన్నకు. నన్ను ప్రేమించి నా ప్రేమను ఆరగించు....అంతకంటె సుఖం

లేదు. మర్యాదగా మాటవినక, కాలయాపనతో కాలం గడుపుతే నీ కోర్కలు పిండుతాను. (రెండడుగులు వేస్తాడు)

గౌరి : ఆగు—నా చెంద్రం....

మూర్తి : (నవ్వి) నీ చెంద్రం! యెందుకా భ్రమ? నిన్ను కాదని కాలదన్నినవాడు తిర్గి నీ కాళ్లు పట్టుకుంటాడనే అపోహ నీ అమాయకత్వాన్ని నిరూపించి వెకిలిగా నవ్వుతోంది. అందని పండుకోసం ఆశపడి అజ్ఞాతంగా ప్రయత్నించి నన్నపార్ధం చేసుకుంటున్నావు .... రా! ఇప్పటికైనా రా! నాదానివై నన్ను సుఖపెట్టు.

గౌరి : నీ వెన్నన్నా చెప్పు. నా శరీరంలోని శక్తులన్నీ నిన్ను చూసి అసహ్యించుకుంటున్నాయి.... కనీసం నా నీడనన్నా ముట్టుకోడానికి నీకు అర్హతలేదు. ప్రాణంపోయినా సరే, ఆనందిస్తాను గాని, నీ వశంమాత్రం కాను. ఇది నా నిశ్చయం ....నా నిశ్చయాన్ని నీవు కాదుకదా నిన్ను సృష్టించినవాడుకూడా మార్చలేడు. దయయుంచి యిలాంటి దగాకోరు మాటల్తో....

మూర్తి : (పెద్దగా) గౌరీ! తీయని మాటల్తో దగాచేసి దారి తప్పించింది నీ చెంద్రంకాని, నేనుకాదు, .... కడసారిగా నిన్ను ప్రేమభిక్ష పెట్టమని ప్రాధేయపడ్తున్నాను .... నామాట కాదంటే నీ బ్రతుకు నామరూపాలు లేకుండా నిలువునా నాశనమవుతుందని మాత్రం తెల్సుకో. మర్యాదగా మాటవినకపోతే మట్టిపాలు చేస్తాను....చెప్పు.

గౌరి : (నవ్వి) సిద్ధంగా వున్నాను. అంతేకాని, తాటాకు చప్పుడికి కుందేళ్లు బెదరవని తెల్సుకో.

మూర్తి: (నవ్వి) వెర్రిదానా! ఎందుకా కోపం? నామాట వింటే నిన్ను విశ్వమోహినిగా తయారుచేసి పూజించి ఆరాధిస్తాను....కడుపునిండా తిండీ, కంటినిండా నిద్ర, చక్కటి సుఖం అనుభవించి ఆనందిస్తావు. నిన్ను పూలమందిరంలో పెట్టి ఆరాధ్య దేవతగా పూజిస్తాను. నా యావజ్జీవమూ నీకు నీ ప్రేమకూ దాసుడుగావుంటాను. ఏమంటావ్?

గౌరి: (కోపంగా) వచ్చినదారి తియ్యమంటాను.... నీ తప్పులు నీవు గ్రహించి క్షమాపణ కోరుకుంటే బాగుంటుందంటాను....నీమొఖం నాకు చూపకుండా యిక్కణ్ణుంచి వెళ్ళమంటాను. (పెద్దగా) వెళ్లు.

మూర్తి: (వికటంగానవ్వి) వెళ్లను..... వెళ్లటానికి మనస్సంగీకరించటల్లేదు....వెళ్లలేకుండావున్నాను .... తప్పనిసరిగా నాదానివి కావాలి .... (ముందుకు నెమ్మదిగానడుస్తాడు)

గౌరి: (తెల్లబోయి చూస్తూ) అన్యాయం.

మూర్తి: కాదు. ఆదర్శం. (నాగన్న, తాత నెమ్మదిగా లోపలకు ప్రవేశించి చాటున నుంచుని మూర్తి మాటల్ని వింటూ ఆనందిస్తూ వుంటారు)

గౌరి: ఇది నీకు తగదు. దిక్కులేని ఆడదాన్ని....

మూర్తి: కనుకనే ప్రేమిస్తున్నాను. (ముందుకు నడుస్తున్నాడు)

గౌరి: నీకిది అపజయం (వెనక్కు తగ్గుతుంది)

మూర్తి: జాగు చేస్తే అదే కల్గుతుందని చెప్తున్నాను.

గౌరి: (జాలిగా) మామయ్యా!

మూర్తి: అవును. ఆ మరుక్షణమే నీ నిర్దోషిత్వాన్ని నిరూపిస్తాను.

గౌరి: ఆ! (తెల్లబోయి చూస్తుంది)

మూర్తి : (తలూపుతూ యీర్ష్యగా) నా మాటలు నీ మనస్సుకి ఎక్కకపోవటం మూలాన నే నాడినది మాయానాటకం.

గౌరి : అన్యాయం.

మూర్తి : అలవాటైంది హటాత్తుగా ఆగుతుందా ?

గౌరి : అర్థమైంది .... నీవు పన్నిన పద్మవ్యూహం పూర్తిగా అర్థమైంది. ఇప్పుడే యీ నిజాన్ని నాల్గువీధులా వెల్లడి చేసి నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంటాను. నిన్ను, నీ ఆశల్ని నిలువునా నీళ్లపాలు చేస్తాను.

మూర్తి : బయటపడే మార్గం ? (నవ్వి) గౌరీ ! వాగటం మూలకంగా నోరునెప్పికాని ఫలితంలేదు. పనికిమాలిన ప్రేలాపనతో ప్రయోజనంలేదు. (చెయ్యిపట్టుకొని భీకరంగా) ఏమంటావు ? [గౌరి చేయివిదల్చుకొని మూర్తి చెంపమీద కొడ్తుంది. మూర్తి మండిపడుతూ వికటంగా నవ్వి బలాత్కారించబోతాడు. తాతా, నాగన్నలు ఆనందపరవశులౌతూ వుంటారు. గౌరి మూర్తి పైకి సమీపానున్న కుండను బలంగా విసురుతుంది. కుండ పగులుతుంది. మూర్తి తప్పుకుంటాడు. ఇంతలో గౌరి పారిపోబోతుంది. గుమ్మానికి అడ్డంగా తాతా, నాగన్నలు వికటంగా నవ్వుతూ నిల్చుంటారు.]

మూర్తి : (కోపంగా) ఆగు. అడుగు ముందుకు వేశావంటే నీ ప్రాణాలు నీకు దక్కవు. (నెమ్మదిగా నడుస్తూ) ఇంతవరకూ నాకు అపజయమనేదిలేదు. ఆమాట గుర్తుంచుకొని నా కోపానికి కానుకగా నీ ప్రేమను ప్రసాదించు. (పెద్దగా) కాదంటే నిన్ను నాశనం చేస్తాను (యింకా

పెద్దగా) ప్రాణాలమీద ఆ శనేదుంటే చెప్పు. ఏమంటావ్ ....(బాగా సమీపించి వురుముతూ చూస్తాడు)

గౌరి : ఆనందంగా ప్రాణాల్ని విడుస్తాను....ఊఁ....చూస్తావేం? ప్రాణం తియ్.

మూర్తి : ఇంకా అదే మాట....

గౌరి : ఎప్పుడూ వొకటే మాట.

మూర్తి : (వికటంగా నవ్వి గౌరిని సమీపించబోతాడు)

చం : (ప్రవేసించి) ఆగు. (మూర్తి చొక్కాపట్టుకు గుంజుతూ ఆవేశంతో) హంతకుడా! ఇదేనా మర్యాద? ఇదేనా పెద్ద మనిషి తరహా? ఇలాంటి నీచపు బ్రతుకు బ్రతికేకన్నా చస్తే మంచిది. అమాయకురాలైన గౌరిమీద నీ కెందు కింత కడుపుమంట? నిష్కారణంగా నేరారోపణచేసి చివరకు బలాత్కారించటానికి కూడా సిద్ధపడ్డావా పశువా? ఈవిధంగా యెన్ని సంసారాలు గంగపాలు చేసి నీ పొట్టనెట్టుకుంటావు? న్యాయం, నీతి, ధర్మం, నీ వే కోశంలోనన్నా పాటిస్తున్నావా? ఛీ! యెందుకయ్యా ఇలాంటి వెధవబ్రతుకు బ్రతుకుతావు. (మూర్తి నాగన్నకి సైగచేస్తాడు. నాగన్న కఱ్ఱతో బలంగా చంద్రం తలపై కొడ్తాడు. తల పగిలి రక్తం కారుతుంది.) అబ్బా: బాధ (పడిపోతాడు)

మూర్తి : (డ్రాయరులో రివాల్వరు నందుకొని చంద్రానికి గురి పెడ్తాడు) నాగన్నా! బలేపని చేశావురా!

గౌరి : (పెద్దగా) చంద్రం! (అని సమీపించబోతుంది)

మూర్తి : (పెద్దగా) నిలు....సమయం చక్కగా చిక్కింది .... చంద్రం ప్రాణాలతో రక్షింపబడాలనుకుంటే నువ్వు నా దానివి కావాలి తక్షణం. లేకపోతే ఇద్దర్నీ ఒక్కసారి గా కాలుస్తాను.

సూ : (మతి చెడిపోయి పిచ్చిగా యేడుస్తూ) బసవయ్యా ! నా దగ్గరకు రాకు. నన్ను క్షమించు ...నేనుకాదు. నేనుకాదు. (ప్రవేశించి వెనకెనక్కు నడుస్తూ చంద్రాన్ని తొక్కుతాడు. అనంతరం చంద్రంమీదపడి పెద్దగా 'చంద్రం' అని యేడుస్తూ వుంటాడు. మూర్తి యీ వింత చూస్తూ వుంటాడు. గౌరి పిస్టల్ తీసుకోవాలనే ఆశతో మూర్తిచేతిని కరుస్తుంది. ఆ తొందర్లో మూర్తి పిస్టల్ పేలుస్తాడు. సూర్యానికి గాయం తగిలి బాధపడ్తుంటాడు. గౌరి బలంగా పిస్టల్ తీసుకుంటుంది. నాగన్న, తాత బెదరి పారిపోబోతారు. ఆ దార్నే సబ్ యినస్పెక్టర్ ఇద్దరు పోలీసుల్ని వెంటబెట్టుకొని ప్రవేశిస్తాడు. నాగన్న, తాతల్కి సంకెళ్లు వేస్తారు.

గౌరి : (పెద్దగా) చంద్రం. (మీదపడి యేడుస్తుంది)

యస్.ఐ : (అక్కడ అందర్నీ ఆశ్చర్యంగా చూస్తూ కోపంగా) మూర్తి యెవరు ?

మూర్తి : (గౌరివంక వకసారిచూచి యస్. ఐ. తో) నేనే!

యస్.ఐ :(నవ్వి) నువ్వా! చేసినపాపాలుచాలక యింకా దేనికోసం ప్రాకులాడుతున్నావు? (యింతలో సూర్యం మూలుగు వినపడుతుంది. ఆదుర్దాగా సూర్యాన్ని సమీపిస్తాడు. పోలీసు వెంటనే మూర్తిప్రక్కన నిలబడి పట్టుకుంటాడు)

యస్.ఐ : ఎవరు నాయనా నిన్ను కాల్చింది ?

మూర్తి : (గౌరిని చూపిస్తూ) అది (గౌరి చంద్రావికి కట్టుకట్టి నెమ్మదిగా లేవదీస్తూ వుంటుంది)

యస్.ఐ : నువ్వు నోర్మూయ్. (సూర్యంతో) ఎవరు నాయనా ?

సూ : (మాట్లాడలేక బాధగా) మూ.... ర్తి .... ఉ .... ఉ.... ఉ....

యస్.ఐ : ఏయ్ యైట్ హండ్రెడ్ అండ్ ఫోర్ (Eight hundred and four) అతనిదగ్గర స్టేటుమెంటు తీసుకో (మూర్తిని సమీపిస్తాడు) ఎందుకు కాల్చావు ? (పోలీసు అడుగుతున్నట్లు, సూర్యం చెప్పలేక చెప్తున్నట్లు నటిస్తూ వుండాలి)

మూర్తి : (నిర్లక్ష్యంగా) నేను కాదు.

యస్.ఐ : (చెంపమీద కొట్టి) కాల్చి పైగా నేను కాదంటావేరా రాస్కెల్. చెప్పు. (చొక్కాపట్టుకు గుంజుతాడు)

మూర్తి :(మాట్లాడడు)

చం : (నెమ్మదిగా లేస్తూ) గౌరీ! (కౌగిలించుకుంటాడు)

గౌరి : (పొంగిపోయి దుఃఖంతో) చంద్రం !

యస్.ఐ:చెప్పు! నువ్వేనా?

మూర్తి :(అవును అన్నట్లు తలూపుతాడు)

యస్.ఐ.(విజిల్ వూదుతాడు. మరిద్దరు పోలీసులు ప్రవేశిస్తారు) వెధవకి సంకెళ్ళెయ్యండి. (మొదటి పోలీసుతో) స్టేటుమెంటు తీసుకున్నావా ? (గౌరి, చంద్రంలు ఆశ్చర్యంగా, విచారంగా వింటూవుంటారు)

పోలీ : సార్.

యస్ ఐ : నీ పేరేమిటి ?

సూ : ....సూ....ర్యం....

యస్.ఐ : భయపడకు-మా సర్వశక్తులు వినియోగించి నిన్ను బ్రతికిస్తాము. (మూర్తిని చూపిస్తూ) యీ నీచుడు గవర్నమెంటుకి ద్రోహంచేసి, యిరుగు పొరుగువాళ్లని అన్యాయంచేసి వాళ్ళ ఆస్థి పాస్తుల్ని అపహరించి ఖూనీలుచేసి, చేయించి, ప్రభుత్వం కంటపడకుండా పారిపోయాడు. వీడికోసం యిండియా అంతా గాలిస్తున్నాము .... ఇంత కాలానికి చంద్రంగారి ధర్మమా అంటూ యిక్కడ దొరికాడు. అసలు వీడి నిజపేరు భద్రయ్య .... మూర్తి అనే మారుపేరుతో యిక్కడ జీవిస్తున్నాడు. యీ నేరాన్ని బట్టి ద్రోహిని అప్పచెప్పిన చంద్రంగార్ని ప్రభుత్వం తరపున ఎంతో అభినందిస్తున్నాము. గౌరి మేనమామ అన్న మమకారంతోను, బసవయ్య తనబావమర్ది అనే వుద్దేశ్యంతోనూ యీగుట్టు బయటపెట్టలేదనుకుంటాను....రక్షించిన వాళ్ళని భక్షిస్తా డీ నీచుడు. చంద్రం! నీవుచేసిన సహాయం మరువరానిది.

సూ : (బాధపడుతూ) చంద్రమా !

యస్.ఐ : అవును....యిక్కడ జరుగుచున్న సంఘటనని మాకు చెప్పి మా సహకారం కోరాడు. వెంటనే వారితో రాక జాగుచేసినందుకు చింతిస్తున్నాము. అప్పుడే వస్తే నీ వీ రివాల్వర్‌కి గురికాకుండా వుండేవాడివి. (మూర్తిప్రక్కనున్న పోలీసుతో) ఏయ్....యీ ద్రోహిని తీసుకుపోయి బొమికలు విరగగొట్టి జైల్లో వెయ్యండి వెధవని.

2పో : (తాత, నాగన్నల్ని) పదండయ్యా (ముందుకు తోస్తాడు)
నాగ : (పడబోయి ఆగి) ఆలిముండామయ్యా! అయ్యగారు చెప్పింది ఆ దొంగార్ని తీసుకెళ్ళమని.
యస్.ఐ : నోరు ముయ్యండి. మీ యిద్దర్నీకూడా అరెస్టుచేశాం. మీరూ వెళాలి. (మూర్తి, తాత, నాగన్నల్ని యిద్దరు పోలీసులు నెట్టుకుంటూ పోతారు)
యస్.ఐ : యయిట్ హండ్రెడ్ అండ్ ఫోర్! .... నువ్విక్కడే వుండు. నేను వెళ్ళి వేన్ పంపుతాను. (చంద్రంని సమీపించి) మీ పవిత్రప్రేమ జయించింది. దుష్టుల్ని శిక్షించింది. ఆరోగ్యం చేకూరుకోగానే ఆదర్శంగా వివాహం చేసుకోండి నాయనా! (నిష్క్రమిస్తాడు)
1పోలీ :(యస్.ఐ. నిష్క్రమించగానే బీడీ అంటించి ప్రక్కగా కూచుంటాడు)
సూ : (బాధగా దేకుతూవచ్చి) చంద్రం! యింక నేను బ్రతకను. ....చెప్పుడుమాటలువిని మోసపోయాను....మీ ప్రేమని వేరు చేయాలని చీడపురుగులా సంచరించి అనేక కుట్రలు పన్నాను. పాపిష్టి డబ్బు కాసించి గడ్డితిన్నాను....కాని నీ ప్రాణాలు పోవలసింది. ఎన్నితప్పులుచేసినా చివరకు ప్రాణమిత్రుని ప్రాణానికి నా ప్రాణాన్ని అడ్డువేసి నీ కోర్కె నెరవేర్చినందుకు సంతోషిస్తున్నాను. (దేకుతూ వెళ్ళి కాళ్ళుపుచ్చుకొని) నేచేసిన అపరాధానికి క్షమించు. లేకపోతే నామనస్సుకి శాంతిలేదు. యిద్దరూ ఏకకంఠంతో వొక్కసారి క్షమించామనండి....అదేచాలు....ఊసరూ....

ఇంకా....నే....నం....ఉ....కో ....ప.... మే....నా....
చం....ద్రం....

చం: (శూన్యంగా చూస్తూ) సూర్యం!

సూ: అవును. ఇంక బ్రతకను. అనండి....ఒక్కసారి అనండి.

చం, గౌరి: అలాగేలే! (సూర్యం నెమ్మదిగా గౌరిచేయి, చంద్రం చేయి కలుపుతాడు)

సూ. ఆ....నం....దం....గా....ప్రా.... ణా ....లు.... వి ....
(ప్రాణాలు విడుస్తాడు. వాయిద్యాలు 'శివరంజని' రాగం హెచ్చుస్థాయిలో వాయిస్తారు.)

చం: (పెద్దగా) సూర్యం!
(పోలీసు, చంద్రం, గౌరి కళ్ళంట నీరు కారుస్తారు)

తెర

సమాప్తం

